# యాస

## కవితా సంకలనం

**గౌరవ సంపాదకులు**

శ్రీ మాదగాని శంకరయ్య

**ప్రధాన సంపాదకులు**

శీలం భద్రయ్య

**సంపాదకులు**

సాగర్ల సత్తయ్య

డా. వి.జయప్రకాశ్

**వందనా పబ్లికేషన్స్**

**నల్గొండ జిల్లా**

యాస కవితాసంకలనం (Yaasa - Anthology of poems)

గౌరవ సంపాదకులు : శ్రీ మాదగాని శంకరయ్య

ప్రధాన సంపాదకులు : శీలం భద్రయ్య

సంపాదకవర్గం : సాగర్లసత్తయ్య

డా. వి. జయప్రకాశ్

మొదటి ముద్రణ : సెప్టెంబరు 2020

ముఖచిత్రం : చిట్టిప్రోలు శ్రీనివాస్
పిజిటి జువాలజీ, తెలంగాణ మోడల్ స్కూల్
ఆత్మకూరు, సూర్యాపేట - 9705992233

**వెల: 84 రూ.లు**

**ప్రతులకు :**

**మాదగాని శంకరయ్య,**
నల్గొండ. 8919848969

ప్రచురణ :

మాదగాని వకుళాశంకర్
వందనాపబ్లికేషన్స్, నల్గొండ జిల్లా

ముద్రణ :

లేపాక్షి ప్రింటర్స్, హైదరాబాదు

**డా.నందిని సిధారెడ్డి**
తొలి అధ్యక్షులు,
తెలంగాణ సాహిత్య అకాడమి,
హైదరాబాదు.

# కవుల సహజ శ్వాస 'యాస'

భాష సజీవత్వానికి గుర్తు. దాని యాస, ఒక భాష భావ వినిమయంతో బాటు నిరంతరంగా వ్యాప్తి చెందుతుందనడానికి, బహుముఖ ప్రయోజనాలు పొందుతుందనడానికి సాక్ష్యం యాస. యాస భాష ప్రయోజనాల్ని విస్తృతం చేస్తుంది. భాషకు మనోహరమైన నుడికారాల్ని, సొగసులను అద్ది దానిని సంపద్వంతం చేస్తుంది యాస. మృతభాషలకు యాసలుండవు. మూసగా మారిన భాషలు యాసలు కోల్పోతాయి. యాసలు కోల్పోయిన భాష క్రమంగా నశించే దశకు చేరుకుంటుంది. వ్యవహారమే భాషకు ప్రాణం, జనవ్యవహారంలోని ఏ భాషకైనా యాసలు రూపుదిద్దుకుంటాయి. జీవకళలు తొణికిసలాడే యాసలు భాషను ఎప్పటికప్పుడు సరికొత్త సొగసులతో సంరక్షిస్తుంటాయి. మండలాలు, ప్రాంతాలు, వృత్తులు, సంస్కృతులు పాలనలు, సమూహాలు భాషా సాంకర్యాలు యాసలకు హేతువులవుతుంటాయి. న్యూనతలు వదిలి యాసలను గౌరవించే భాషా దృష్టి ప్రజాస్వామిక సంస్కార లక్షణం. యాస అస్తిత్వ ప్రతీక.

తెలంగాణ తెలుగు అనేక యాసలతో కూడిన ప్రత్యేక లక్షణాలున్న భాష. తెలుగే అయినప్పటికీ తెలంగాణ తెలుగు అది ఒక ప్రాంతీయ అస్తిత్వం, మాండలికంగా కుదించి చెప్పడం హ్రస్వదృష్టి మాత్రమే.

ప్రజాకవి కాళోజి జయంతిని తెలంగాణ తెలుగుభాషా దినోత్సవంగా జరుపుకోవాలని అప్పటి ప్రత్యేకరాష్ట్ర అస్తిత్వ ఉద్యమం భావించింది. తెలంగాణ రాష్ట్రం సిద్ధించిన తరువాత కాళోజి జయంతి తెలంగాణ భాషాదినోత్సవం అనే భావన స్థిరపడింది.

సెప్టెంబరు 9 కాళోజి జయంతి సందర్భంగా వందనా పబ్లికేషన్స్, నల్గొండ వారు యాస కవితా సంకలనం ప్రచురిస్తున్నందుకు సంతోషం. 84 మంది కవుల కవితల సంకలానానికి యాస పేరు పెట్టడం మరింత సంతోషం. భాషాభిమానానికి ప్రాంతీయ అస్తిత్వ చైతన్యానికి అది మంచి సంకేతం. ఈ

సంకలనానికి సంపాదకులుగా వ్యవహరించిన మాదగాని శంకరయ్య, శీలం భద్రయ్య, సాగర్ల సత్తయ్య, డా.వి.జయప్రకాశ్‌లకు హృదయాభినందనలు.

యాస సంకలనంలో తెలంగాణ సాంస్కృతిక చైతన్యాన్ని తెలియజెప్పే కవితలు, తెలుగు యాస, భాష గొప్పదనాన్ని వర్ణించే కవితలు, కాళోజి ప్రత్యేకతను చాటిచెప్పే కవితలు, తెలంగాణ సహజ స్వేచ్ఛా రామణీయకతను పరిమళిస్తున్నాయి. 'ఎవరి యాస వారికి ప్రాణం', 'భావ వ్యక్తీకరణ దాని సొగసు', 'జానపదాల్లో జాలువారే యాస', 'యాస ఒక ఉనికి', 'యాస సొంత గొంతుక', 'మన భాష మట్టి మనుషుల పదకోశమే', 'స్వేచ్ఛ యాసకు సహజ పరిమళం' వంటి పంక్తులు యాస ప్రత్యేకతలను ఉన్నతీకరించాయి.

కవుల ప్రయత్నమంతా తెలంగాణ పరిమళాలు దశదిశలా వ్యాప్తి చేయాలనే. వారందరికీ అక్షరాభినందనలు. సంపాదకుల, కవుల, నిర్వాహకుల ఆకాంక్షలు ఫలించాలని తెలుగుకు, తెలంగాణ తెలుగుకు అన్ని ప్రాంతాల యాసలకు వైభవం రావాలని కోరుకుంటూ ...

**నందిని సిద్ధారెడ్డి**

**5 సెప్టెంబరు 2020**
**(ఉపాధ్యాయ దినోత్సవం)**

**డాక్టర్ ఏనుగు నరసింహారెడ్డి**
తొలి కార్యదర్శి, తెలంగాణ సాహిత్య అకాడమి, హైదరాబాదు.
అదనపు కలెక్టర్, కరీంనగర్ జిల్లా.

## ఇంపైన యాస

— ఏనుగు నరసింహారెడ్డి

దేశ భవిష్యత్తు తరగతి గదుల్లో రూపుదిద్దుకొంటుందంటారు. మారిన కాలమాన పరిస్థితుల్లో ఎవరికైనా ఈ మాట చెబితే 'ఏ తరగతి గదుల్లో? ప్రభుత్వ తరగతి గదుల్లోనా? ప్రైవేటు తరగతి గదుల్లోనా?' అని ప్రశ్నించే అవకాశం ఉంది. స్వాతంత్ర్యానంతరపు తొలిరోజుల్లో పాలన సామ్యవాదం లక్ష్యంగా ఉంటూ నడుస్తున్నట్లనిపించేది కానీ ఇప్పుడు అన్నీ మిశ్రమ వ్యవస్థలుగా మారిపోయినాయి. విద్యారంగం కూడా. మేధావులు ఆనందించే విషయం ఏమిటంటే ప్రభుత్వ పాఠశాలలు (ప్రైవేటు పాఠశాలలతో) పోటీపడుతున్నాయి, కొన్నిచోట్ల. అందుకు కారణం అక్కడ పనిచేసే ఉపాధ్యాయుల చిత్తశుద్ధి, అంకితభావం. అలా వృత్తిపట్ల అంకితభావమున్న ఉపాధ్యాయులు ఏమేమి చేయగలరో 'యాస' సంకలనం తెస్తున్న ఈ అధ్యాపక మిత్రులు అవన్నీ చేస్తున్నారు.

శ్రీశైలం భద్రయ్యగారు ఒక సంవత్సరం కిందట వల్లాల విద్యార్థుల రచనలను సంకలనం చేసారు, అక్షరంగా. సాగర్ల సత్తయ్యగారు ప్రతి సంవత్సరం స్పాట్ వాల్యూ-యేషన్‌లో పాల్గొనే కవుల సంకలనాన్ని తెస్తున్నారు. డా॥ వి.జయప్రకాశ్ గారు మంచి సాహిత్య వ్యాసాలను పత్రికలలో ప్రచురిస్తున్నారు.

భాష ఒక ఉపన్యాసమనుకుంటే యాస దాని శ్వాస. అసలు యాస లేకుండా భాష మనుగడే ఉండదనడం కూడా అతిశయోక్తి కాదు. తెలంగాణ భాషలోని యాసలోని సొబగును ఉద్గరించిన మనీషి కాళోజీ. ఆయన

జయంతి సందర్భంగా ఒక కవితా సంపుటి వేసుకు రావడం, దానికి 'యాస' అని పేరు పెట్టడం బాగుంది. ఇందులో వివిధ జిల్లాలకు చెందిన 78 మంది కవుల కవిత్వముండడం వైవిధ్యం. ప్రతి కవి తనదైన శైలిలో రాయడమే కవిత్వానికి నిజమైన సౌందర్యం. యాస పేరుతో వస్తున్న సంకలనం కాళోజీ బొమ్మతో కూడిన కవర్‌ను వేసిన చిట్టిపోలు శ్రీనివాస్ గారు అభినందనీయులు.

చీకటిని తిడుతూ కూర్చోవడం కంటే చిన్న దీపమైనా వెలిగించమనేది పాతమాటలే కావచ్చు కానీ ఈ ప్రసారానికి వెలుగు చూపించి మాదగాని శంకరయ్య గారు ఆ మాట నిజమేనని నిరూపించారు.

— డా॥ ఏనుగు నరసింహారెడ్డి
8978869183

# నమస్సులు

సమాజంలో నైతిక విలువల, మంచి చెడుల, గౌరవమర్యాదల పరిరక్షణే లక్ష్యంగా మంచి రచనలు అందించాలన్న సంకల్పంతో తెలంగాణ యాస, భాష, సంస్కృతి సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, వేషభాషలు ప్రతిబింబించాలని పరితపించే తెలంగాణ వైతాళికుడు, నిరాడంబరజీవి, నిత్య ప్రాతఃస్మరణీయుడు, తెలంగాణ ముద్దుబిడ్డ, ప్రజాకవి కాళోజి నారాయణరావుగారి జయంతి పురస్కరించుకొని "యాస కవితా సంకలనం" మీ ముందుకు మా పబ్లికేషన్ ద్వారా ముద్రణ రూపంలో తీసుకురావడం మా అదృష్టం, ఒకింత గర్వంగా భావిస్తున్నాం.

సహృదయులైన పాఠకుల మనస్సుకు నచ్చేవిధంగా అచ్చమైన తెలంగాణ యాసలో రచనలను ఈ పుస్తకంలో పొందుపరచడం జరిగింది. భవిష్యత్తులో కూడా మీ మనస్సును గెలిచే మంచి రచనలను అందించడానికి మా పబ్లికేషన్ కృషిచేయగలదని ఈ సందర్భంగా మనవిచేస్తున్నాం.

యాస కవితా సంకలనం రూపకల్పన అనే మహాయాగంలో భాగస్వాములై తమ సమయాన్ని, మేధస్సును అందించిన సంపాదక వర్గానికి, పిలుపునిచ్చినంతనే స్పందించి సిసలైన తెలంగాణ యాసను ఇంకుగా ఒలికించి ఇంపుగా రాసిన కవిమిత్రులకు హృదయ పూర్వక నమస్సులు. ఈ పుస్తకాన్ని పెద్ద మనసుతో ఆశీర్వదించిన పెద్దలకు కృతజ్ఞపూర్వక నమస్సులు.

కృతజ్ఞతలతో...

మీ

**మాదగాని వకుళాశంకర్**

వందనా పబ్లికేషన్స్, నల్గొండ

# శనార్తులు

భాష అందరి సొత్తు. దానికి మేర తెల్వదు. పండిత, పామరుల విభజన చేయదు. తెలంగాణగడ్డ చారిత్రక, సాంస్కృతిక, సాహిత్య వైభవానికి కొంగు పైకమసొంటి పెన్నిధి. కురిక్యాల బొమ్మలమ్మ గుట్టపై కందపద్యమై మెరిసిన తెలంగాణ తెలుగు భాష, నవాబుల కాలంలోనూ రాజసన్మానాలందుకున్నది. ఉర్దూ పారశీకం, మరాఠి, కన్నడం వంటి పరాయి భాషలను కూడా ఆదరించి పోషించిన కన్నతల్లి నా తెలంగాణ. గంగాజమున తెహజిబ్ సంస్కృతి ఇక్కడి తెలుగు, ఉర్దూ భాషలల్ల తేటగా గానొస్తది.

శరీర, భౌగోళిక, పరిసర కారకాలతో భాష పాయలుగా చీలిపోతది. దీన్నే యాస అంటున్నము. ఒక భాషలో యాస ఎన్నో తీర్లగుంటది. ప్రతి యాస ప్రత్యేక జీవన నాగరికత సంస్కృతిని చరిత్రగా దాచుకొని ఉంటది. పల్లె జనాల యాసగరిశెలో వ్యాకరణం ఉన్నా తెల్వకపోవచ్చు. కానీ ఆ మాటకారితనంలో మోతెబరి మమకార సోంపు, మాటల మాధుర్యం జాడ నిండుగా పొర్లి ఉంటది. పసందైన పరాచిక పల్కులు దండిగ ఉంటయి. ఇంతగనం ఎందుకు, ఇగురంగా చెప్పే మాటే బంగారం, యాసతో పలకరిస్తే మనసే కాదు పెయి కూడ పులకరిస్తది. వల్లెక్కాలకి మాటలు సోపతిగాడ్లై సరసాలాడుతయి. సందకాడ నల్గురు కూడితే జనంనోట సామెతలు, జాతీయాలు ఊట చెలిమలయితయి. సిలుం బడని భాష ,యాస మన తెలంగాణది.

ఇక్కడి యాస తెలంగాణ భాషా కల్పవృక్షానికి పూసిన సింగిడిలోలె, బంగారు రంగున్న తంగేడు పువ్వోలె తరతరాలుగా తళుకులీనుతుంది. మాట్లాడితే మనసు నిండా సంబుర భావం మత్తడి దుంకుతది.వింటే మనుషుల మధ్య అనుబంధాలు పూలతీగలలోలె అల్లుకుంటయి. పాల్కురికి సోమనాధుని బసవపురాణం,పోతన భాగవతం,పొన్నగంటి తెలగన యయాతిచరిత్ర నుంచి కాళోజి నాగొడవ దాకా వొయ్యిలలో ఉన్న తెలంగాణ యాస సొగసు ఈనాటికి సామాన్యుడి నాలుకపై బతికే ఉంది. ప్రామాణిక భాష మాట్లాడాలంటే సాధన అవసరం. కానీ యాస సహజ సిద్దంగానే సిద్దిస్తుంది. యాస భాషకు మెరుపు.

తెలంగాణ భాష, యాస, మాండలిక పొద్దు, అస్తిత్వ శ్వాస, ఆత్మగౌరవ హద్దు ప్రజాకవి కాళోజినారాయణరావు. వారి జయంతి సందర్భంగా నల్గొండ నుండి "యాస కవితా సంకలనం" తీసుకురావాలని కుశాలున్న కవుల నుండి అంతర్జాలం వేదికగా కవితలను పంపమని అడిగినం. అడిగిన వెంటనే ప్రాంతాలకు అతీతంగా తెలంగాణ రాష్ట్రంతో బాటుగా ఆంధ్రా, రాయలసీమ, కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలనుండి విశేషస్పందన రావడం ఇక్కడి యాసకున్న ఆకర్షణకు నిదర్శనం.

కావరపు మాటల మతాబులను గుండెల్లో కాల్చి కార్చిచ్చును రేపిన వలసవాద భాషను యాష్టకొచ్చి ఇప్పుడిప్పుడే వదిలేస్తున్నం. సురవరం ప్రతాపరెడ్డి, కాళోజి తొవ్వలో మన భాషను యాసను సోయితో ప్రచార, ప్రసార సాధనాలలో మల్లీ గౌరవంగా వాడుతున్నాం. ఈ సందర్భంలో యాస కవితా సంకలనం భావితరానికి ఒక తరగనిముల్లె కావాలని, దీనిలో భాగస్వామ్యం అయిన వారికి చెరగని జ్ఞాపకం కావాలని ఆశిస్తున్నం.

యాస కవితాసంకలనం రావడంలో ముందుమాట రాసి మమ్మల్ని ప్రోత్సహించిన తెలంగాణ సాహిత్య అకాడమి తొలి అధ్యక్షులు, ప్రముఖ సాహితీవేత్త డా. నందిని సిధారెడ్డి గారికి, అభినందనలు తెలియజేసిన తెలంగాణ సాహిత్య అకాడమి తొలి కార్యదర్శి డా.ఏనుగు నరసింహారెడ్డి గారికి, ఆర్థిక సహకారం అందించిన మా గౌరవ సంపాదకులు, వందనా పబ్లికేషన్స్ వ్యవస్థాపకులు, యోగా మాస్టారు శ్రీ మాదగాని శంకరయ్య గారి అర్ధాంగి వకుళా శంకర్‌గారికి, సహాయ సహకారాలు అందించిన తెలుగు భాషా చైతన్య సమితి వ్యవస్థాపక అధ్యక్షులు బడేసాబ్ గారికి, భాగస్వామ్యం వహించిన కవిమిత్రులకు, అభినందనలు అందజేసిన సాహిత్యాభిలాషులకు మరియు అందమైన ముఖచిత్రం అందించిన మా మిత్రులు శ్రీ చిట్టిప్రోలు శ్రీనివాస్ గారికి మా శనార్తులు.

**– సంపాదకులు**

# విషయ సూచిక



# 1. యాస

యాసంటే కమ్మనైన అమ్మదనం
విస్పష్టతకు చిరునామా
గుప్పిట బంధించి చెప్పే నైజం కానేకాదు
మనసువిప్పి మాట్లాడే ప్రియనేస్తంలా
కల్మషం లేని పసిపాప బోసినవ్వులా ఉంటది
కపటం లేని ప్రేమగుణం దాని సొంతం
వంటింటి పరిమళంలా  గుబాళిస్తది
పంటపొలాలపై నుండి వీచే పైరగాలిలా
హృదయాన్ని పరవశింపజేస్తది
భావాల  దోబూచులాట
పదాల వెతుకులాట   అసలే ఉండదు
హృదయాకాశాన  ఆనందాల  హరివిల్లై
అనుభూతిని కలిగిస్తది
తత్తరపాటు లేని భావవ్యక్తీకరణే దాని సొగసు
ఆడంబరత్వం మచ్చుకు కూడా కనిపించదు
విచ్చుకున్న ముద్దబంతి పువ్వులా
విరబూసిన తంగేడు పువ్వు నవ్వులా
ముగ్ధమనోహరత్వం దాని సొంతం
పల్లెటూరి  పిల్లగాని  మాటలా
సెలయేటిపై వీచే పిల్లగాలిలామైమరపిస్తది
కాళోజీ కవితలా, గోరేటి పాటలా అలరిస్తది
సహజ భాషా సౌందర్యమై విరాజిల్లుతది

**– డాక్టర్ తండు కృష్ణ కౌండిన్య,**
నల్గొండ – 9704731346



## 2. ఇత్తనం గంప

ఎల్తురు పిట్ట తూర్పు సెట్టుమీద
వాలక మునుపే సీపుర్ల ఏక్తారా మోగేది
సర్కారు బాయిల సాదేసి గుంజంగా
అల్కు నీళ్ల దడిసిన ఆకిల్లు
సుక్కల ముగ్గులు పూసేది
పిల్ల తల్లుల కూడెయ్యంగ
సేపులకొచ్చిన పొదుగును తరిపి దుడ్డె తాగిన తపాలె నురుగలు గక్కేది
ఎర్రమట్టలికి నాంముద్ద గీసిన పోయిగోడ మీన
పుదిచ్చిన కూరాడు కడుపు నిండా
కలి నింపుకొని పురుసతుగ కూసునేది.
కొరాడేసుకొని కోండ్రెయ్యబోయే మట్టి కాళ్లకు
మా ఊరి కట్టు గాల్వ నీళ్ధార బోసేది.
ఇత్తునం గంప నెత్తినెత్తుకోని
దూపబుడ్డుగ్గం సేతవట్టుకోని
తోడికోడళ్ళంతా తొవ్వవట్టేది.
ఎర్రటెండల రెండు జాముల దాకా
అరక దున్ని అలిసిన పసులు
గట్టుకు దిని చెట్టు కింద నెవరేసేది.
సందలవడంగా ఇల్లుజేరి
వాడిక కళ్ళు దాగి కాళ్ళమంచం మీనొరిగి కంటినిండా నిద్రవొయ్యేది.
అంత సిక్కని పల్లె బతుకిప్పుడు పలసవడ్డది పట్నం వాసనలెమ్మడి
పరుగులు దీత్తాంది.

**– చిట్ల ప్రేమ్ కుమార్,సోమారం**
పర్వతగిరి,వరంగల్ – 8555932699

# 3. తెల్గం తెలంగ



చెక్క పల్క మీన చేతిమునివ్రేళ్ళ కద్లక అక్షరం
నల్లాలం బొగ్గుగట్టి ప్రకృతి పందిళ్ళు పొదిగి
పొదుగుసేపైన పాలదార జీవం జీవై...
తొవ్వ జరుగు జాడలో వినికిడి సైగ సంకేతం

బెరడు చిట్లిన జంగ్లాతొక బాస ఆకుదిద్దే
కనుపాపలు నీలాలు నిల్చి గుబి కార్చిన నీర
పాదం చెద్రని నడ్క జాడలెత్కి కరికుల వృత్తే
కలె గొల్పే తుర్కం అర్వంతెల్గం తెలంగ బల్గం
చేతి వెన్నెముద్ద తొలి తెలంగాణ బాస కుప్పె

నిద్వేత్తిన అడగుకింద అచ్చర ఊట
ప్రపంచపటం ఓనామాలు దిద్దుబాటే
యాసబాసలెత్తిన దోషిలి పిడికిల్లిప్పే
పొదు పొద్గాల తెలంగ తెల్గమే నిత్తెపొక్త

**– వేముల ఎల్లయ్య,**
తెలంగాణ నిఘంటువు,
నల్గొండ,9440002659

# 4. ఈ నేలే మహాబలి



ఆకురాయి - నాపరాయి- కిరాయి -పరాయీలైతేనేమి?
చేసిన శ్రమలుఫలిస్తూ రావాలిగాని..!
మట్టి గ్రాసంగా పూస్తూ, గరిసెల్ని కాకపోయినా
కడుపులను నింపుతూ ఉండాలెగాని
ఫలితందక్కవలసిందన్నింటి కన్నాముందు 'శ్రమకే'
"పరిశ్రమకే" నని..పరిశ్రమనిష్టపడని ప్రాణం
పాషాణమౌతుందనే నిజాన్ని మరువకుండా రావాలిగాని..
రాతియుగాలను, మూగతనాలను
సైగల కాలాలను
గడిపిన యాతనల నుండి ఆసాంతపు
శ్రమోపజీవనమే ప్రాణాయుతమైనదని
ఎన్నుకుంటూ వచ్చిన మానవుని
అవక్ర పరాక్రమమైన విక్రమణ...
కాలమంటే విక్రమణే...
కాలమంటే - భువనైక మోహనోద్ధతమైన భవిష్యత్తూ
సమస్త విశాల విశ్వం, గోళాలు అన్నీ యెన్నైనా
మానవుడిని వదలుకొనగలవా?!
మానవుడినికాదనగలవా?!
కనుక్కోగలవాడన్నింటికీ పరిష్కారాలను గనుక
మానవుడే మహనీయుడు
ఈనేల నేలగల
అనన్య సామాన్యమైన
ఈ "నిరంతర-పరిశ్రమ జీవియే
అభినవ సా 'మాన్యుడు"

**- వేణుసంకోజు,**
నల్గొండ - 948419881

# 5. నెనరు



వాడకట్టు జనమంతా
వాకిట్ల మంచాలేసుకొని
ఎత సిత ఎల్లబోసుకునే
యాది జేసుకొనే ఆత్మీయతల కలబోత
అరుగు చింతకాడ భాగోతం ఆడుతుంటే
పొద్దంత చేసిన కష్టం మర్సి
గోర్కోళ్లు వంగిందాక జూసిపోయి
మోటగట్టిన జ్ఞాపకం
గట్కో గంజో తాగినా
పండుగకో పబ్బానికో
గొట్టొడ్ల మెతుకులు తిన్నా
నాటి బర్కతే వేరు
మాదిగోల్ల మీనమ్మ గొల్ల లచ్చుమ్మ
ఎల్ల గౌడు కుమ్మరి వీరయ్య
వావి వరుసల తోటి పిలుచుకుంటూ
ఒక్క కుటుంబం లెక్క బతికిన మనాది
ఎన్కటి నుంచి కూడ
తెలంగాణ గడ్డది
మాట ముచ్చట్లల్ల, పెట్టి పోతలల్ల
పావురం గల్ల కన్నతల్లి నెనరు

– సాగర్ల సత్తయ్య,
నల్గొండ,7989117415

# 6. యాడుంది



యాడుంది నా యాస
కథలల్ల కవితలల్లనే కొద్దో గొప్పో ఊపిరి పోసుకుంటా వుంది
యాడుంది నా యాస
శ్రమకారుల నాలుకల మీదనే జారుడు బండాట ఆడుతా వుంది
సామాన్య జనం నోళ్లల్లనే నారపొట్టెలా నాంతా వుంది
యాడుంది నాయాస
బానిస బుద్ధులింకా లుకలుకలాడుతనే వున్నయ్
బానిస రోగం కరోనా పురుగులెక్కబతుకు మూలాల్ని తొలుస్తనే వుంది
నా రాజ్యం నా చేతికొచ్చినా నా రాజ్యం గొంతింకా
పాత పాటనే పాడుతాంది
పుస్తకాల పల్లకీ ఎక్కి తరగతి గది వీధుల్లో పట్ట మహిషిలా
ఊరేగాల్సిన నా యాసింకా పరిచారికలానే
ఓ మూలన నిలబడి పోయుంద
నా యాసను వెక్కిరించిన నోళ్లింకా పూర్తిగా మూతపడనే లేదు
నా యాసను దుష్ట పాత్రలకు స్వరంలా మార్చి
మా బతుకుల్లో దొర్లించిన అవమానాల అపశృతులింకా చెదిరిపోనే లేదు
అవహేళనల గాయాలింకా మాసిపోనే లేదు
భాషేదైనా ఎవరి యాస వారికి ప్రాణం
యాస ఒక జీవిక యాస ఒక ఉనికి యాస ఒక ప్రాణ దీపం
యాస ఒక తొక్కులాట యాస ఒక బతుకు పాట
యాస ఒక సొంతు గొంతు
నా గొంతు నాది గావాలె నా స్వరం నాది గావాలె
నా పాట నాది గావాలె నా మాట నాది గావాలె
నా యాస నాక్కావాలె ఒట్టు నా బతుకు నాది గావాలె
నా యాసే కదా నా ఊపిరి నా యాసే కదా నా సంస్కృతి సిరి



నా అధికారిక యాసింకా గొంగళి దశలోనే వుంది
సీతాకోక చిలుకై రాజ్యం పూల తోటనింకా చుట్టేయటం లేదు
సామాన్యుని స్వరంలో పలికే నా యాస
నా రాజ్యానికీ పూర్తి శ్వాస కావాలె
పరయాసా బానిసతనాన్ని వీడి
నాదైన  సొంత గొంతుతో నా యాస
రాజ్యమంతా పాడుకునే నా బతుకమ్మ పాట గావాలె
నా కాళోజీ కవిత కావాలె నా సకల యాసా సరళికొక
ప్రామాణిక స్వరం గావాలె !

**– చిత్తలూరి సత్యనారాయణ,**
రేపాక,యాదాద్రి,
భువనగిరి,8247432521

# 7. యాస గోస



ఎవని యాసానిది ఎవని గొసానిది
భాష ముర్రు పాలు తాగినోడికె
దానియాస గోసలు  తెలుస్తె
నీయవ్వ భాషంటే  ఎరుకేనా
దాని యాసంటే  ఎరుకేనా
యాసంటే కాళోజీ యాది జంగయ్య  జాతర
గద్దర్ పాట. గజ్జ కడితే ధూమ్ దాం ఆట.
 రొట్ట గాల్నాసన రోకటి కారం రుసి
పిజ్జ మజా గాండ్ల కేమెర్క.
ఎండాగాలం సెల్కల్ల ఆన వడితే
వొచ్చే ఆసన ఎన్ని ఇత్తర్లు గుమ్మరిస్తోస్తది
కతలు కైతీకాలు రసొలంతా
యాస లేని భాషల్నే  రాయవటిరి
మరి యాసెట్ల బతుకుతది
మొత్కాకుల దాని పూలు
మూడు   గండ్లోనికి శానిస్టమంట
గోసి బట్టకు గవ్వల్లేవ్ గని
ఉసిరి గాయ  రుమాల్ గావాలంటరు.
యాది మరిసిన యాసను
గిప్పుడు కాసి వడవోసి  నట్లైందిగదా.
యాసంటే సిన్న తనం గాదు
యాసంటే తెలంగాణ భాషామృతం

**– డా.మదిరె సిద్దన్న ,**
జహీరాబాద్ ,సంగారెడ్డి, 9849678201



# 8. చైతన్య జ్వాల

భాష తోటను పూయించిన
పదాల పరిమళం గాదె యాస
కలుపుకుంటూ పోతూ ఉనికి వృద్ధి చేస్తూ
కొత్త రీతులను జగతికి ఎక్కించునది గాదె యాస
గ్రాంథిక పొరల మాటున
ప్రామాణిక పాదం చీల్చి
ఉవ్వెత్తున ఎగిసిన కెరటం గాదె యాస
బురద మడిన నాటిన
కొత్త మొలకలతో పాటే పెరిగిన పాట నా యాస
అమ్మలక్కలు నోట పని పాట
శ్రమ చెమట పరిమళం ఆ యాస
అల్పల మాటలకు ప్రతి ఘటన కెరటాల
ముంచెత్తిన కూడలి గాదె యాస
జనచైతన్య జ్వాల గాదె యాస


– **పున్న దామోదర్,**
భూదాన్ పోచంపల్లి,
యాదాద్రి జిల్లా, 9491388086



# 9. అవ్వ

అవ్వ భుజానికెత్తుకొని
తొవ్వ సూపించేది నా సిన్నతనంలో..
ఆవు లేగదూడ కోసం ఎతికినట్లు
అవ్వ నా కోసం ఎతుకులాడి
మా గతుకుల ఊసులతోపాటు
జీవిత మెతుకులు తినిపించేది..
నాకు ఊహ తెల్సినంక
మా నాయనకు అమ్మంటా...మా అవ్వ
కానీ...నాకు అన్నీ నాయనమ్మే..
అవ్వ శెక్కుడు సంచే
నాకు తెల్సిన షేర్ మార్కెట్..
అవ్వ సంచిలో అణా పైసైన తగ్గుతదేమో కానీ..
నాపై ప్రేమ ఆవగింజంతైనా తగ్గలే..
అమ్మానాన్నల అదిరింపులు
చూసానేమో గానీ..
అవ్వ అరక్షణం కోపమైనా
నాపై సూడలే...
ఆకాశంలో మేఘంలా...
వర్షాకాలంలో జల్లులా..
మా అవ్వ ఎప్పుడూప్రేను కురిపిస్తనే ఉండేది...
నాకు బతుకు బాటను సూపిన తొవ్వ.....మా అవ్వ...!!!


**– ఎం.జానకిరామ్,**
కొండకింది గూడెం,
కేతేపల్లి,నల్గొండ. 9666342772

# 10. నా బాస



అవ్వ నేర్పించిన బాస
అవ్వలోని కమ్మదనాన్ని ఎరుక చేసిన బాస
అవ్వలోని ఆప్యాయతను పేయికద్దిన బాస
నాకు బువ్వ పెడుతున్న బాస
నా పల్లెకు పల నేర్పిన బాస
నా జాతికి అస్తిత్వాన్ని ఎరుక చేసిన బాస
పరాయి పాలనలో జీవాచ్ఛవమై మళ్ళీ పురుడు పోసుకుని
తలెత్తి గౌరవంగా నిలబడ్డ బాస
మన ఆత్మ గౌరవాన్ని నిలబెట్టిన బాస
నా జాతి జాడ తెలియజేసిన బాస
మా కవుల కలములకు జవ జీవములు ఇచ్చిన బాస
ఆ భాషే నా తెలంగాణ తెలుగు భాష

**– కేతేపల్లి శ్రీను,**
నల్గొండ,
8008309141

# 11. ఇగ మీ ఇష్టం



ఒక్కతీరు గాదు ఒక్క కత గాదు
పక్కబొక్కల్లనవడే దాకా అంగవడి పన్జేసినా
అచ్చేదీతాకైతే పొయ్యేడ్డి తాటాకన్నట్టున్నది గతి
నీ..బతుకుల మన్నువడ-దీనికగ్గిదల్గ
ఎన్ని కొత్తల్జంపాయించినా- బొంద నిండనే కచ్చె!
ఏం జెయ్యమంటరో మీరే జర జెప్పురి బాంచెన్....
తెలగాడమచ్చెద్దాంక-ఇగ మన దరిద్రం బారి పోతదని
మనంత సిపాయిలోల్లుండరని,
మనది మనకు సాలంగ నాలుగు మందిగ్గుడ్క వెడ్తమని
ఓ మస్తుమాటలినీఇనీ %--%మాయలవడ్డం
మంత్రమేసి కూకుండ వెట్నోల్లతిర్గ బమ్మినం బజార్లవడి
ఓ..మారాజ్జం మాకచ్చిందని  ఎగిర్నం -దున్కినం
అయ్పాయె-అమ్మలొడ్సినయ్-ఇంకేమో ఒడ్సినట్ల
లొటపెట పెద్యాలకెర్జూసి నట్లయి పాయె బత్కు థూ!
కూల్నాలి జేస్కుంట,ఓ పూట దింటోపూటుపాస ముండుకుంటా
అప్పు సప్పుల్జేసి, పొల్లగాన్లకు సదు జెప్పిపిస్తిమి
అయ్పాయెనా! గా టేరింగో కారింగో గూడ అయిపాయె,
ఇంకేముంది,ఇగ మన నౌకర్లు మన కస్తయ్ గదాని మస్తు ముర్సినం
కాని ఏమైంది,మూతి పండ్లురాల గొట్టుకున్నట్టాయె!
అరె!కొడుకు లిద్దట్ల కమస్కం ఒక్కడికన్న,
టీచర్ పని సర్కార్ది దొర్కుతదని కలల్గన్నం
ఇగో!ఇయ్యాల్లంటె-రేపని ఆయిదాల
మీదాయిదాలేస్ కుంటా యేండ్లు
గడవట్టె గాని రాకున్నా గొంగడాన్నే అన్న బత్కులైనయ్
ఇండ్ల ఓల్లనేమనాల్నో దొయ్యనే కచ్చింది.



సదుకని సావుకారి కాడికెల్లి తెచ్చిన
బాకడ్డితోన్డబలై కుకుండె!
ఎట్లనయ్యా!గిట్లైతే అనంటే ఏందీ!
సదంగనె,నౌకరచ్చుడేనా!
బారున్నవ్ పో! అయినా ఒక్కటే
నౌకర్మీద సూటి వెట్కోని కుసుంటె నడుస్తుందా!
ఎన్నిసార్లపీసు తంతెలెక్కి దిగినా,
యాడున్నవ్రా! కొడ్కా!అంటే,
అన్నే ఉన్ననే బాపూ!అని జవాబిచ్చినాంకడ,
ఏంజెయ్యాన్నో, ఏం మనస్సును వట్టకచ్చింది.
ఓల్లనేమన్నా అంత కతకతైదనిప్పట్దాక
నోట్లింత మన్ను వోస్కోని గుసున్న గని,ఇగ నా తరం గాదే బాపూ!
తెగినోడ్కి తెడ్డేలింగమన్నట్ల,బాజాప్త బజార్ల వడ్తం!
మాయమాటల్నమ్మం. మమ్ముల్ని,
కాపాడి,మా మంచి జూసెటోల్లనే గుర్తువెట్టుకుంటం
ఉన్నమాటంటాన్న! ఇగ మీ ఇష్టం.

**మడిపల్లి భద్రయ్య**
శాస్త్రి నగర్ (నార్త్) నిర్మల్
9885830550, 7780678657

## 12. యాది



యాదుంది నా బాల్యపు  యాస
యాడుంది నా బతుకున యాస
మూలసుక్క పొడవంగ నిద్దుర లేపే కోడి కూతల యాస
కమ్మని స్వరమై ఇన్పించే  కోకిల గానము యాస
ఆకిలూడ్సేటపుడు  అమ్మచేతి గాజుల సవ్వడుల యాస
కమ్మదనపు జొన్నగటక రుసొంటి అవ్వ పిలుపు  యాస
బడిగంట వేళకు సోపతి గాళ్ళ పిలుపుల యాస
యాదుంది నా బాల్యపు  యాస
యాడుంది నా బతుకున యాస
వానాకాలం చెరువు అలుగులో నీటి గలగలల యాస
పొలం దున్నే జోడెద్దుల మెడలో కట్టిన గంటల పల్లవి  యాస
పచ్చని పొలాల శ్రామిక గళాలు పలికె మధురగానాల యాస
కుమ్మరి చక్రం,సాలెల మగ్గం జీవన గోసపు యాస
మురికిని నేర్పుగా వదిలించె సాకలి బండ పలికె యాస
యాదుంది నా బాల్యపు  యాస
యాడుంది నా బతుకున యాస
బుడతల నిద్దురబుచ్చే తల్లుల జోలపాటల యాస
రేకలుబారంగా తెల్లని పాల నురగల శబ్దపు యాస
బతుకమ్మ పండుగకు వాయినాలు పాడే అక్కల పాటల యాస
ఎల్లమ్మ ఉప్పలమ్మ పండుగలకు జమిడిక మ్రోతల యాస
పీర్లకొట్లాల కాడ అసై దూలల యాస
రాయబడని కవుల సిరాలో దాగిన యాస
యాదుంది నా బాల్యపు  యాస
యాడుంది నా బతుకున యాస

**– శీలం భద్రయ్య,**
నల్గొండ – 9885838288

# 13. ఇంపైన బాల్యపు యాస



నా బచ్పనంతా గిప్పటీక్కీ యాదికొస్తనే ఉంటది
సోపతిగాళ్ళతో గప్పాల్గొడ్తూ తిర్గిన గా తొవ్వలన్నీ
పోరీల్తో పరాశ్కాలాడ్తూ జెప్పిన ముచ్చట్లన్నీ యాది మర్వలే
సేన్లసెల్కల బొంటి ఆగమాగంగా ఉర్కిన దినాలన్నీ
మతికొస్తె భలే మజాగుంటది తియ్
పోరీపోరళ్ళం కల్సిమెల్సి ఆడేటోళ్ళం
లచ్చవ్వ దుక్ణంలో ఆఠనాబెట్టి కొన్న పిప్పరమెంట్లు
కాకెంగిలితో తినేటోళ్ళం
కులమేదైనా వరసల్తోన పిల్సుకునేటోళ్ళం
చెల్లే ! పుట్టింటికెప్పుడొచ్చినవే...!?
కాకా....మంచిగున్నవానే...?
ఒంట్ల మంచిగుంటుంది గదా...జర ఫైలమంటూ
కడ్పులకెల్లి మాట్లాడుకుంట నోట్ల పండోలెగుండెటోళ్ళం
ఒకే తల్లి కడ్పుల పుట్టకపోయినా అన్నదమ్ములోలె ఉండెటోళ్ళం
వాగువొర్రెల్లల్ల పరికశ్యాపలు పట్టి కాయిపాయి చేసుకొని
కమ్మగ తినేటోళ్ళం
సుట్టపోడింటికొచ్చి సుక్కముక్క లేకుండా బోయెటోడా...?
సిందేయకుండా ఆగేటోడా...?
గిప్పుడు జమానంతా ఉల్టాపల్టా అయింది తియ్
పట్నంలకొచ్చి పరేషానైతున్నం
బంధాల్ని మర్సి రందిల బత్కుతున్నం
పుక్కట్లకలవాటుపడి బర?తక్కువ పన్లుజేత్తన్నం
గడ్సిపోయిన గతాన్ని పసితనంలో దేవులాడుకుంటున్నం
గసుమంటి దినాలు మళ్ళీరావు తియ్


– యెలిశాల నాగమోహన్,

ఖమ్మం – 9949970398

# 14. ముద్దబంతి పువ్వు



సక్కని యాస తెలంగాణ బాస
తెలంగాణ యాస తెలంగాణ భాషకు శ్వాస
ముగ్ధ త్వంతో ఉన్న ముద్దబంతి పువ్వు వోలే
తెలంగాణ యాస ముద్దులొలికే భాష
అందమైన పదాల అల్లుకున్న పందిరి తెలంగాణ భాష
శ్రీకరం హితకరము కాలగలిసిన కల్పవల్లి
అనురాగాల కళామతల్లి మన తెలంగాణ తల్లి
పోరాట వీరుల పటిమకు
త్యాగధనుల ధన్యతకు
కష్టాలకు కష్టాలకు కడగండ్ల కు
చిరునామామా తెలంగాణ నేల
పంటల పచ్చదనం తో పరిఢవిల్లు
బతుకమ్మ పండుగ తో అలరారి
కవులకు కళాకారులకు నటులకు పరిపాలనా దక్షు లకు
తెలంగాణ ఒక శ్రీ గిరి
యాదగిరి నరసింహుడు పెట్టని కోటగా
కరుణతో ఏలునట్టి తెలంగాణ
సంస్కృతికి సంప్రదాయాలకు పట్టుగొమ్మగా
నిలిచిన తెలంగాణ  భావితరాలకు మార్గగామి
వర్తమాన సంస్కృతికికి ఆలంబన

**– డా.వై వి సిహెచ్ లీలా పద్మజ,**
బొబ్బిలి, విజయనగరం
9492016219

# 15. పల్లె సిత్రాలు



మా పల్లె మనసు ...
సద్దన్నంలో పచ్చడేసుకుని
ఉల్లిపాయతో నంజుకున్నట్టు కమ్మగుంటది..
అరసేతిలో జర్రున జారిపోతుంటే
దొరకబుచ్చుకుని జుర్రుకునే తాటిముంజొలే సల్లంగుంటది ..
మా పల్లె సందం ...ఏటి గట్టున కూకొని
దోస్తులతో పందెం కాసి కట్టుకున్న ఇసుక గూడోలే సక్కంగుంటది ..
బావికాడ నీళ్ళట్టుకుని నడుము పైన బిందెట్టుకుని
నడిచొచ్చే వయ్యారంలా సొగసుగుంటది ..
మా పల్లె కొంటెతనం ...
సందేళ అరుగు మీద కూసుని
ఆకాసంలో సుక్కల్ని లెక్కెట్టినట్టు తమాషాగుంటది ..
పక్కనోడి తోటలో
మావిడి పిందెల్ని కోసే దొంగతనంలా గమ్మత్తుగుంటది ..
యిన్ని సందాలు ...సిత్రాలున్న
మా పల్లె .. యెప్పుడు పోదమాన్న ఊహకే
మనసు ఉబలాటపడుతుంటది పోగానే ఒళ్ళు పులకరిత్తాంటది

**– మాదారపు వాణిశ్రీ,**
హన్మకొండ
9247286668

# 16. పల్లె బతుకు...



నాడు పొద్దుగాల
కోడి కూసేయాళ్లకు
పట్టేమంచం మీద
కునుకు తీస్తున్న ఆలుమొగలు
పొద్దుపొడవక ముందే నిద్ర లేసేటోళ్లు
ఆకిలూకి అలుకుపెట్టి
చూడసక్కగ ముగ్గులుపెట్టి
సుతారంగా జొన్నసంకటి కాసేటోళ్లు...
పందిరి గుంజకు కట్టేసిన
లేగ దూడను ఇడిసిపెట్టి
పాతగురిగిల పాలు పిండి
పొంగు చూస్తూ పొయ్యికాడ
కూసునేటోళ్లు...
జంగిడి బర్లు మేతకు పొయినప్పుడు
పోరగాండ్లు ఊరు దాటేవరకు
ఉరికేటోళ్లు...
బాయికాడ గడ్డమీదా
రేగిచెట్టుకు రేగిపళ్ళను
రాలగొట్టి తింటూ
ఊరబిశ్కల వెంట ఉరుకులాడేటోళ్లు...
రైతన్నలు సద్దిబువ్వల సల్లపోసుకొని
సరాసరి జుర్రుకొని తాగేటోళ్లు...
జోడిఎడ్లను కాడిగట్టి
అరకమెడిని చేతబట్టి
ఏరువాక సాగెటోళ్లు
ఎదురు పొద్దుకు ఎండ
ఎగపోస్తూ ఉండగా
తుమ్మ నీడకు అమ్మ
సేద తీరుతుండే
పాలుగురాళ్ల నడుమ
పానుపేసిన అయ్యా
కునుకు పట్టేదాకా
కూనిరాగాలు తీస్తుండే
పండుగోచ్చిందంటే
కష్టమంతా మరిచి
ఆలుమొగలు కూడి
సందే పొద్దుదాకా
సంత సరుకులు కొంటూ
కన్నబిడ్డలకు రంగు
బట్టలను తెచ్చేటోళ్లు
రాత్రిపూట బజనపాటలు
అమ్మలక్కల బతుకమ్మ ఆటలు
పడుచుపిల్లల
కోలాట ఆటలు ఆడేటోళ్లు...
వయసు పిల్లలు ఓర చూపుతో
కన్యపిల్లలను కలుసుకుంటరు
ఒంటరైతే ఒడికిచేరి
ఒదిగిపోయి ఒక్కటైతరు
ప్రజల కోసం పోరుజేసి
తెగువనంతా ధారపోసి
అమరులైన వీరులంతా
యాదికొస్తే జ్ఞాపకాలకు
కొదవలేదు...

**గోగుల శ్రీనివాస్,**
నల్గొండ – 9398043768

# 17. తరగని భాష



తరము లెన్ని యైన తరగని నాభాష
తేనె యూటయదియు తెలుగు భాష
ద్విత్వయక్షరాలు తెలగాన సీమలో
పదము చివర యుండి పలుకు యాస

కట్టె కొట్టి నట్లు కచ్చితత్వముతోడ
పల్లె పట్న మందు పలుకు చుండు
ధీర్ఘ యాస లేక తెలగాన జనమంత
తీపిగొల్పునటుల తెలుగు పలుకు

జాస్తిగాను వచ్చె జాతులు యన్నెన్నొ
వర్తకంబు చేయ వరద వోలె
ఇట్టిగడ్డయందు ఇమిడిపోయెనువారు
కనగ లేము నిపుడు కాంచ వెదక

పొరుగు వారి భాష పొందికా యమరింది
పంచ దార రీతి పాలవోలె
అమృతంబు మించు అమ్మభాషయునాది
ఎందు వెతక కనము ఇట్టి భాష

జాన పదములందు జాలువారెడియాస
ప్రతియు పదము లోన పాలు తొణకు
నిర్మలంబు తోడ నిండు దనము కూడి
వినగ నెవ్వరైన వీను విందె

**– డాక్టర్ లింగనబోయిన లేఖానందస్వామి,**
నల్గొండ – 9441465165

# 18. తెలంగాణా ఉద్యమం - భాష



తెలంగాణా గడ్డమీద
భూమి కోసం భుక్తి కోసం నేలతల్లి విముక్తి కోసం
భూపోరాటాలు, దళితోద్యమాలు అస్తిత్వవాదోద్యమాలలో
రజాకారు వ్యతిరేక పోరాటాలలో నక్సల్ ఉద్యమ నేపథ్యంలో
రక్తం ధారపోసి తమ ప్రాణాలొడ్డి పోరాడిన వారెందరో
ఆ పోరాట వీరులగురించి
పోరాట క్రమాలను చిత్రికరిస్తూ
కవులు కథకులు రచయితలు
తమ కలాలకు, గళాలకు పదునుపెట్టి
ప్రాంతీయతా పరిమళం అద్ది
తెలంగాణా మాండలిక భాషను యాసను
పేద వర్గాల భాషగా యాసగా
అభివర్ణించి తెలంగాణా భాషపై అభిమానంతో పేదల పక్షపాతంతో
సమకాలీనతతో జన జీవన వైవిధ్యంతో
సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలను
ఉన్నతీకరిస్తూ వైవిధ్యభరితంగా
తెలంగాణా వాడుక భాషను యాసను
సుసంపన్నం చేసిన మహానుభావులెందరో

**– ఆచార్య ఎం.రామనాథం నాయుడు,**
మైసూరు – 8762357996

## 19. భాష తెలంగాణ



భావవినిమయ సాధనమేకదా భాషంటే!
ముఖపద్మం విచ్చుకున్నప్పుడు సంకేతపరిమళాలు
ఇరుకు మనసుల్ని దగ్గరికి
చేర్చడమే కదా భాషంటే!
అమ్మతనం స్పర్శయై ఆ కమ్మదనం మనల్ని
మనుషుల్నిచేసి నిలబెట్టినప్పుడేకదా భాషంటే!
తేనెటీగలమై ప్రోగుచేసిన జనపదామృత బీజాల్ని
నువ్వూ నేనూ మనం బతికించుకుంటేనేకదా
రేపటితరం భాషాగూటికి గూడుకట్టేది!
యాభైయ్యారక్షరాల అరవు భాష కాదు ఆంధ్ర!
ముప్పైయ్యారక్షరాల అచ్చమైనది మన తెలంగాణ భాష
ఎప్పటికీ మనభాష మట్టిమనుషుల పదకోశమే!
పలుకుబడుల కొలిమిలో మనయాసకు పుటంపెట్టి పరుషాల కల్మషాల్ని
కడిగి వేసినవాళ్ళం!
సరళాల సరాల్ని కంఠమాలగా ధరించినవాళ్ళం
ఊష్మాల క్లేశాల్ని ఒదల్చుకుని నిసర్గ అక్షరాల్ని
ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేసుకున్నాం!
మన యాస భాషవాడుకలో ముంచుకుని
పులుకడిగిన ముత్యాల్లా
మన అక్షరాల్ని తెలంగాణ భాష యాసగా దిద్దుకుందాం!!


**– డా.బోడ జగన్నాథ్,**
భువనగిరి,
జిల్లా యాదాద్రి భువనగిరి
9848904063

# 20. గంధం



తెలంగాణ వెలుగు భాష జిలుగు
తెలంగాణ భాష మన శ్వాస
తెలంగాణ తెలుగు కమ్మదనం
తెలంగాణ పలుకు సంగీతమొలుకు
తెలంగాణ అక్షరం తేనెల క్షీరం
తెలంగాణ పదం భావ బంధం
తెలంగాణ వాక్యం స్వర్గ సౌఖ్యం
తెలంగాణ బాగోతం యాసల సేద్యం
తెలంగాణ కావ్యం సాహితీ భావ్యం
తెలంగాణ కీర్తన నటరాజు నర్తన
తెలంగాణ రచన రమ్య కీర్తన
తెలంగాణ పాట సంగీతానికి కోట
తెలంగాణ గేయం వీనుల రాగమయం
తెలంగాణ గానం సంగీత ప్రాణం
తెలంగాణ మాట ముత్యాల మూట
తెలంగాణ ఒగ్గు కథ చందన గంధం
తెలంగాణ భాష వెన్నెల ఉష

**– డా. దీపక్ న్యాతి,**
నంది అవార్డు గ్రహీత,
హైదరాబాద్ – 9849488837

# 21. నవ తెలంగాణ



యేబదివందల వత్సర చరితం, బుద్ధుని అడుగులు నడయాడిన ప్రాంతం
కాకతీయకళ కోటప్రపంచం, నిజాం నైజం నడిపిన రాజ్యం
పద్య గద్యముల పసిడి ఆలయం, పాటల మూటల పంటకు నిలయం
కూచిపూడి భామాకలాపం, పేరిణి తాండవ ప్రేరణ మూలం
ఎల్లమ్మ పోచమ్మ క్షేత్రం, చెరుగట్టు మల్లన్న నేత్రం
సమ్మక్క సారక్క జాతర సంద్రం, దర్గా సాయిబు తాయత్తు మంత్రం
వేయి స్థంభాల వేలవైభవం, భద్రాచల బాసరల మందిరం
శిలంకోట రామప్పల శిల్పం, బోనగిరి గోల్కొండల శిఖరం
చేనేత చేతుల మేటి నైపుణ్యం, గద్వాల్ కాటన్ సిరిసిల్ల మగ్గం
పోచంపల్లి ఇక్కత్ అందం, నారాయణపేట్ సిల్కుసోయగం
నెత్తిన ఎత్తిన ఉత్సవ బోనం, బతుకమ్మాటల మగువల మురిపెం
కోలాహల కూనల కోలాటం, రంజాన్ రంజుగ జరుపు ఆరాటం
వరిగెలు వడ్లు మిరుపల ధాన్యం, జొన్నలు తైదలు కొర్రల ధనం
కృష్ణ గోదారి మంజీర నాట్యం, భీమా మూసీ పాలేరు నృత్యం
బిర్యాని షవర్మ ఖుర్బాని మధురం, కమ్మనైన పోలెలు పాయసం
పచ్చిపులుసు గరిజెలు సకినం, నోరూరించే రుచుల సంగమం
కమ్మని రుచుల సన్నని బియ్యం, మేటి విద్యల నేటి గురుకులం
దాశరధి శ్రీనాథ సాహిత్యం, పోతన గోపన్నల పద్యం
కాళోజీ కసిరెడ్డిల కవిత్వం, ముఖ్యం కేసిఆర్ ఉద్యమ కెరటం
సినారె–సుద్దాల మన సురవరం నందిని –గద్దర్ గోరేటిల భావం
అందెశ్రీ–చంద్రబోసుల కలం, రసమయ్ –విమలక్కల గళం
తప్పెటగుళ్ళు –భాగవతం, ఒగ్గుకథ మన మూలధనం
జనజీవనం మన జానపదం, ప్రజాగాయాల గేయఫలం
బంగరు అడుగులు చేసే పయనం, కోట్లాది ప్రజలందరి ప్రాణం
లక్షల గొంతుల గుండెలో గాణం, నా ఈ నవతెలంగాణం!

**– డా. గోగు వెంకటేశ్వర్లు, –** 9490440714



## 22. నా తెలంగాణా

నా తెలంగాణ ....
కాళోజి వ్యావహారిక భాషా తెలంగాణ
దాశరధి కోటిరతనాల వీణ
ఆచార్య జయశంకర్ స్థితప్రజ్ఞ తెలంగాణ
సుద్దాల హనుమంతు రైతు తెలంగాణ
సురవరం కవుల తెలంగాణ
కుమరంభీం జల్జంగల్ జమీన్ తెలంగాణ
జ్ఞానపీఠ సినారె మానవీయ తెలంగాణ
పీవీ భూసంస్కరణల తెలంగాణ
నా తెలంగాణ ....
ఇరివెంటి వాగ్భూషణం తెలంగాణ
కాకతీయుల సస్యశ్యామల తెలంగాణ
గద్దర్ సమసమాజ తెలంగాణ
శ్రీ కాంతచారి ఆత్మగౌరవ తెలంగాణ
ఉస్మానియా విశ్వవిద్యాలయం చైతన్య జ్వలనం తెలంగాణ
నా తెలంగాణ ....
నందిని సిదారెడ్డి నాగేటి చాలల్ల భూమిస్వప్నం నా తెలంగాణ
కేసీఆర్ కలగన్న బంగారు తెలంగాణ
నా తెలంగాణ భావిభారత పౌరులు కలగన్న
నవభారతానికే  ఆదర్శతెలంగాణ

**– యం.భీక్య,**
నేరేడుగోమ్మ, గుండ్లపల్లి,
నల్గొండ జిల్లా. 9493711042

# 23. ఎన్కటి రాకపోకలు



ఎన్కట సుట్ట పోల్లు సుట్టపు సూపుకు ఇంటికొస్తాంద్రని
ఊరోళ్ళతోనో పక్కూరోళ్ళతోనో చెప్పంపేటోళ్ళు
ఇగగా వార్త తెలిషిన దగ్గర్నుండి వాళ్ళకోసం
ఎప్పుడొస్తురా అని కండ్లు కాయలుగాషినట్టు ఎదురుజూషెటోళ్ళం
సక్కగ రోడ్లులేని బాటపొంట బడి ఎండ్లబండ్లల్లనో
ఎర్రబస్సెక్కో పోగబండెక్కో వాళ్ళు నానాతంటాలువడి ఇల్లుజేరంగనే ఇగ
మా అమ్మోళ్ళు ముసలోల్లు  మీదబడి ఒకటే ఏడుపేడ్షేటోళ్ళు
ఎందుకేడుస్తాంద్రో అస్సలు సమజుగాగపోయేది
గాళ్ళకు కాళ్ళకు నీళ్ళిచ్చి కుర్చిపీటలమీద కూర్సోబెట్టి
కుశలప్రశ్నలన్ని అడిగెటోళ్ళు
చిన్నోళ్ళం వాల్ల కాళ్ళకు దండాలు పెట్టెటోళ్ళం
వాళ్ళు పావురంగ దగ్గరికి తీస్కొని
ఓ ఐదు పైసలో పది పైసలో ఇస్తరేమోనని ఆశపడేటోళ్ళం
గాకాలంల ఎవ్వరొచ్చిన వట్టిచేతుల్తోటి రాకపోయేటోళ్ళు
ఏపండో ఫలహారమో తెచ్చేటోళ్ళు వాళ్ళేంతెజ్జింద్రో అని
అక్కజేల్లెండ్లం నక్కి నక్కి జూషెటోళ్ళం
వచ్చినోళ్ళకోసం మేం సాదుకునే కోడినే దొరకబట్టి
కోషెటోళ్ళు మాఇంట్ల పెద్దోళ్ళు
గప్పుడైతే నాగుండెల మెలిపెట్టినట్లైయ్యేది
నాకండ్లల్ల నీళ్ళుదిరిగేది ఎందుకంటె గాకోళ్ళను పెంచుడు
అవ్వి గుడ్లేడ పెడ్తానయో అని ఇంటిసుట్టు ఎత్కుడు
కోళ్ళగూడును సాపుజేసుడు గుడ్లు పొదిగి పిల్లల్ని జేస్తే
సంబురపడుడు గియ్యన్ని నాపనులాయె
గందుకే దుఖమొచ్చేది కోడ్ని దొర్కబట్టి కోస్తాంటె
కని అమ్మ కమ్మగ వండినంక గింతంత అంటుబోషి
రెండు తున్కలేస్తె సప్పరిచ్చుకుంట తినేటోళ్ళం



ఇగ సుట్టపోళ్ళు ఎన్నిరోజులుంటె అన్నిరోజులు బడెగ్గొట్టుడే నాయె
ఎన్నో ముచ్చట్లు షెప్పుకునేటోళ్ళు ఓరాత్రిదాక
బయట పక్కలేసుకొని ఎన్నెట్ల సుక్కల్ని లెక్కబెట్టుకుంట
మేమాడుకునేటోళ్ళం వచ్చినోళ్ళ పోరగాండ్లతోని
ఇగ గావాళ్ళు పోయేరోజు వస్తాందంటెనే
అందరి ముఖాలల్ల రంది బట్టుకునేది
వాళ్ళకోసం ఏతెల్లారగట్లనో అమ్మోళ్ళు లేషి
సద్దిగట్టుడుకు వంటలు జేషెటోళ్ళు
వాళ్ళు పోయేటప్పుడు మల్లఅర్ధగంటషేపు ఏడ్షెటోళ్ళు
పంపలేక పంపలేక నడుళ్ళదాక అందరంబోయెటోళ్ళం
వాళ్ళుగూడ పోలేక పోలేక దుడ్డెనొదిలి
గడ్డికిపోయే ఆవులోలె పోయెటోళ్ళు
గా పాషాలు గిప్పుడేడున్నయ్ ఎవలన్న వస్తాంద్రంటెనే
ఎందుకొస్తాంద్రు ఎప్పుడుబోతరని అడుగుడేనాయె
అసలు సుట్టపోళ్ళ ఇండ్లపొంటి వచ్చిపోయేటందుకు జర్రంతగూడ
కాలంలేని ఎండిన గుండెల బత్కులాయె
కాలమెంత మారిపోయింది
మల్ల గా ఎన్కటి రోజులొస్తె ఎంతబాగుండు కద...

**– వకుళవాసు,**
హన్మకొండ
9989198334

# 24. తెలంగాణ సవ్వడులు



తెలంగాణమంటే సరగాల సవ్వడులై
వాగువంకలు,అలగుమత్తడులు దుంకినట్లు
సక్కదనాల సిక్కుడుతీగల తెలంగాణ బాస మత్తుగుంటది
మందరాలొల్కే బంతిపూలదండ నా తెలంగాణ
మధురసొబగుల పోతన మధుపాలుపొంగించి
ఉరుతర గద్యకవనాలు పాల్కురికి పాపిడిబిల్ల
అచ్చతెనుగుల భావతరంగాలుపారించిన సోమన
నిజాంపిశాచపు మన్నుదుల్పిన దాశరథి నిప్పురవ్వలు
గాలితిత్తులు ఉడిపడినా పర్వాలేదన్న కాలన్న గేయగాలపనాలు
ఎవడిసొత్తని ఎగిరెగిరి తిరిగేవంటూ రామనామాజపాలు
కీర్తిప్రకీర్తులు పల్లవించినా రామదాసు కలంపోటులు
వట్టికోట తెలంగాణ సింగిడై కథల పొదిరిల్లులై
రంగాచార్య నవాబు నగిషీలను దున్మాడిన నవలికలు
దొరతనంమీద తెలంగాణ బాస మర్లవడ్డది
సినారె సిత్రాలు ఇంద్రధనుస్సులై అలకుజల్లగా
సదశివుడి సాత్రాలు సందడులు సక్కబెట్టగా
గద్దరన్న గళం గంగలమై గంతులీడగా
కలల మాగాణి తెలంగాణ చరితలు పూవ్వులైరాలగా
నెత్తురుజల్లిన అమరులత్యాగఫలం దండిగా నిరూపించిన
నా తెలంగాణ వొరికుప్పల పసిడిమూటలు భాష
తెలంగాణ బాస సెమట సుక్కల పాలధారలు వొల్కే
బాసయాసలు ఉర్కులు పరుగులేట్టి శివయ్య జటాజూటంలో
తారసెద్రుల్ల కాంతికిరణాలు వెల్గులు జిమ్మింది
నా తెలంగాణ గజ్జెలు సవ్వల్ల రాగిణిమాల.

– ఓర్సు రాజ్ మానస,
ధర్మపురి, జగిత్యాల జిల్లా – 9849446027

# 25. పరిమళం



తెలుగే మన తొలిభాష
తెలుగే మన అమ్మ భాష
స్వచ్ఛ మైన తెలుగు భాష
స్వేచ్ఛగా మాట్లాడు భాష
ఉగ్గుపాలతో రంగరించి
ఊకొట్టించిన భాష
తెలుగులోనే మాట్లాడు
తెలుగులోనే పోట్లాడు
తెలుగులోని మెలికలన్నీ
తెలివితోటి నేర్చుకో
మాటలు నువు నేర్చుకో
మాట తీరు మార్చుకో
మమతలనే పంచుకో
విలువలనే పెంచుకో
అమ్మా అని పిలిచినప్పుడు
దేవుడిని కొలిచినపుడు
చుక్కల్ని లెక్కించిన నపుడు
వెలిగేను తెలుగుదనం
కలిగేను మనకానందం
కవిత్రయములు కలిసి
తెలుగు నెరిగి రాసారు
తెలుగు విలువ తెలిపారు
జాతిని వెలిగించారు.
బ్రౌన్ గారి బుర్రలోని
ఆలోచనే ఈ తెలుగుదనం
గిడుగు గారి గొడుగు కింద
ఎదిగిన ఈ తెలుగుతనం
దేవరాయల నోట పలికిన
అద్భుత బాషా పరిమళం
మహామహుల కలం నుంచి
జాలువారిన జానపదం
నవనాడులను మీటి
వుత్తేజం నింపు ఈ తెలుగు
మనస్సుని పులకింప చేసే
ఆయుధం ఈ తెలుగు
పరబాషలు నేర్చుకో కానీ
తెలుగును నువు మరువ బోకు
తెలుగులోన నమస్కారం
చాటుకో నీ సంస్కారం
తెలుగులోనే మాట్లాడి
చెప్పుకో నీ గొప్పతనం


– ఎస్.కె.రజియా
హాలియా, నల్గొండ
9440017886

# 26. కదనజీవి



అవును ...అతను అనంతమైన
ఆకాశాన్ని
చుట్టుతా కప్పుకున్న భూమి
చుట్టూ తాను
భుమిలా భ్రమణం చెందుతూ
భూమిని మించిన భూమికను
సృష్టించుకున్న అతనే
ప్రజల మనిషి కాళోజీ
అక్షాంశ రేఖాంశాల్లా
అడ్డం నిలువుగా సమాజాన్ని
అల్లుకుపోయిన ఆలోచనలఖని
భూమికి వున్నట్టే
అతని జీవితంనిండా
పీఠభూములు మైదానాలు
ఉష్ణ శీతల మండలాలు
తలనిండా సుడిగుండాల సృష్టించే
రుతుపవన వ్యవస్థలు
అగ్నిపర్వతాలున్న గుండెలోనే
చల్లని మంచు శిఖరాలు
నిప్పులు చెరిగే కళ్ళ నిండా
కరుణా జలపాతాలు
అన్యాయాన్ని ముంచెత్తే సునామీలు
గంతు నిండా గగన గర్జనలు
తలపై కిరీటమొకటి లేదు గాని
అతను రూపంలో అచ్చంగా
నరసింహావతారమే
గాంధీయిస్టుల నుండిగద్దరిష్టుల దాకా
అందరినీ అభిముకంచేసుకొని
తనచుట్టే తిప్పుకున్న
తెలంగాణ బొడ్రాయి
అతని పాదాలు
పల్లేర్లను తొక్కుకుంటూ
పల్లెల్ని చుట్టిన జగన్నాథ రథచక్రాలు
అందరి గుండెలు లబ్బొ డబ్బు
అని కొట్టుకుంటుంటే
ఆయన గుండె మాత్రం
స్వేచ్ఛారావమై మోగింది
తెలంగాణ కోసమని
సంచి పట్టుకొని ఊరూరా తిరిగాడు
అది సంచిలోకి రాకముందే
తనువు చాలించిపోయిందు
ఇక ఆ ఉద్యమాల సంచి
ఎక్కడుందో వెదికి పట్టండి
వొలికిన ఆశయాలు నింపుకొని సాగండి
ఇప్పుడతని గొడవ
మన గొడవగానే మిగిలే ఉంది

– ఏబూషి నర్సింహ్మా,
నల్గొండ జిల్లా – 9542806804

# 27. నిప్పు కణిక



మానవత్వపు మస్తిష్కాలకు
తిరుగుబాటు జెండా ఆవిష్కరించి
బతుకు బాటవైనవ్ !
అక్రమార్కుల అన్యాయాలపై
రాలే ప్రశ్నల పిడుగులకు
ఆత్మ బంధువైనవ్ !

చెమట చుక్కల రంగు రుచులను
తెగ జుర్రినోళ్ళను
నిలువుగా నిరసించినవ్ !
అసమానతల ఛీత్కారాలను
ఎండగట్టిన గరళ కంఠుడవు
ప్రమాణాల విలువలు చాటిన
నిస్వార్థ వజ్రకంఠుడవు.
అనంత లక్ష్యాల గొంతుకల్లో
ఏకైక స్వర ప్రతినిధివైనవ్.
అవినీతి మదగజాన్ని నియంత్రించే
అక్షరాల అంకుశాలతో
ప్రమాదాల అంచుల్లో
ప్రమోదాలు పలికించి
ప్రజా కవివైనవ్.
కత్తుల వంతెన పై నిలబడని
ఇజాలు లేని కాళోజీ !!
నిజాల నిప్పుకణికవు.
అగాథపు జననిధికి అందించిన
సంస్కరణల సునామీ నీవు.
ముక్కలై పోతున్న
తరతరాల
హృదయపుటద్దాలకు
సార్వకాలిక ఓదార్పువైనవ్.
జగాన్ని కదిలించి దార్శనికుడవైనవ్
యుగాన్ని పలకరించి
విశ్వకవివైనవ్.

**– మండల స్వామి,**
పిట్టంపల్లి,
నల్గొండ జిల్లా
9177607603



# 28. తెలంగాణ వాయి

ఓరుగల్లు సోయితో పొలికేక పెట్టి
నిజాం దురహంకారాన్ని ఎదిరించి
ప్రజలపక్షం తానై నిలిచి
విలువల వలువలతో
ప్రజాకవే పద్మవిభూషణుడై
యాసలోనే మాట్లాడుతానని
తెలంగాణభాషలోనే రాస్తానని
కుండబద్దలు కొట్టిన నిబద్ధత
నిరాడంబరత,నిస్వార్థం అలంకారాలై
రాజకీయాలు సేవకోసమేనని
సుతిమెత్తగా చురకలంటిస్తూ
సమాజసమస్యలే తన గొడవగా చాటింపు వేస్తూ
అన్నదమ్ముల అనుబంధానికి ప్రతీకగా నిల్చి
ప్రధాని తన స్నేహితుడైనా
ప్రజలే తన చిరునామా చేసుకున్న
తెలంగాణ అస్తిత్వ చారిత్రకుడు
కాళోజీ అంటే కలం కాలం కలగలిసిన క్రాంతిశిఖరం

**– డా.రామక కృష్ణమూర్తి,**
బోయినపల్లి, మేడ్చల్
948285353

# 29. ఒక్క ముచ్చట జెప్పుండ్రి



నాకు సమజ్ గాక అడుగుతాన ఒక్క ముచ్చట జెప్పుండ్రి
అస్సల్ మనమేం జేత్తానం కాళోజీని ఆరాధిస్తానం సరే
ఆయినె జెప్పిన మాటలు ఆచరిస్తానమా
ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక
అంటే వహ్వా అంటానం గనీ కనీసం మన మెదడునన్న కదిలిస్తానమా
ఓటిచ్చునప్పుడే ఉండాలి బుద్ధి అంటే
ఔ నిజమే అంటానం గనీ నోటుకో చీరకో సారాసీసకో
ఓటునమ్ముకోకుంటెప్పుడన్నున్నమా
అభ్యర్థి ఏ పార్టీవాడని కాదు ఏపాటివాడో చూడుమంటే
భేషైన మాటని చప్పట్లు కొట్టినం గనీ
ఉద్యమపార్టీల జేరిన ఉద్యమద్రోహులను
గెలిపియ్యకుంట ఊకున్నమా
అన్యాయాన్నెదిరించినోడు నాకారాధ్యుడన్న
మాటకి ఫిదా ఐనం గనీ మనసుట్టు జరిగే అన్యాయాలను
ఏడనన్న ఎదిరిస్తానమా తెలుగుబిడ్డవురోరి తెలుగు మాట్లాడుటకు
సంకోచపడెదవు సంగతేమిటిరా అంటే
సక్కటి మాట జెప్పిండని సంబురపడ్డం గనీ
ఆ ఎంగిలిపీసుల ఇంగిలీషోని సంక నాకకుంట
ఎన్నడన్నున్నమా ప్రతీచాదస్తం ఒక దేవుడే ఏదో ఒక రూపంలో గోకుడే
అంటే ఆ మాటలోని చమత్కారానికి నవ్వుకున్నం గనీ
మనలోని చాదస్తపు గోకుడును ఒక్కనాడన్న
ఒదిలిచ్చుకునే ప్రయత్నం జేశినమా
ఇప్పుడు జెప్పుండ్రి మనం కాళోజీ వారసులమెట్లయితమో.....

**– సొన్నాయిల కృష్ణవేణి,**
భట్టుపల్లి , వరంగల్ అర్బన్ – 7731851853

# 30. వేగుచుక్క



మాటలో చేతలో మనయాస దొర్లిస్తు
అణచివేతలపైన రణము జేసె!
పలుకుబడులభాష బడిపిల్లలకుమేత
వ్యవహార జ్ఞానమై వాసిగూర్చు!
పార్టీల వ్రతమొద్దు ప్రగతియేముద్దంచు
వ్యక్తిత్వముండుటె ముక్తియనెను!
తప్పు యెవరిదైన ముప్పుచేకూర్చంచు
దండిగా శిక్షించి తరుముమనెను !
వేష భాషలో కాళోజి వేగుచుక్క
అక్షరాయుధముల తోడ లక్ష్యమెంచె!
నిత్యచైతన్యకవితాను సత్యవ్రతుడు
తెలుగు తెలగాణయాసకే వెలుగురేడు!

**– డా.పాండాల మహేశ్వర్,**
గౌసుకొండ
పోచంపల్లి యాదాద్రి
9912180054.

# 31.బతుకంతా దేశానికే



ఈ మట్టిలో
ఉద్యమాలు
పిడికిళ్ళై మొలకెత్తుతాయి
ప్రవాహమై
ఉధృతంగా ప్రవహిస్తాయి
అన్యాయాలను
ఊడ్చేసుకుంటూ
నియంతలను
తన సుడిగుండాల్లో
ముంచ్చెత్తుతాయి
ఈనేల
కడుపు పంట అతడు
ప్రపంచ యుద్ధ ధ్వనుల్లో
జన్మించిన మాటల శబ్ద ఫిరంగి
అన్యాయంపై తిరగబడతాడు
న్యాయాన్నెప్పుడు గెలిపిస్తుంటాడు
ప్రాంతాల ఎగుడు దిగుబడులు
ఏర్పడుతుంటే
సరి చేయాలనే బుల్డోజర్ అతడు
ఒకసారి పుష్పమై
అనురాగల సువాసనలను
వెదజల్లుతడు
మరొకసారి సూర్యుడై
చంద్ర నిప్పులు కురిపిస్తడు
అప్పుడప్పుడు
చల్లని వెన్నెల కురిపించే
మమతల చంద్రుడవుతడు
ప్రజల యాస
ప్రజల భాషకు
పట్టం కట్టిన ప్రజాకవి
ప్రజల కలల పుత్రుడు
ఆయన 'నాగొడవ' ల కాళోజీ
లోకం కన్నీటి బాధలను చూసి
తానే శోక సంద్రమైనవాడు
పుట్టుక ఆయనది
చావు ఆయనది
బతుకంతా దేశానికే
అట్టడుగుల
అన్నార్తుల పక్షం నిలిచిన
నిఖార్సయిన తెలంగాణవాది
ప్రాంతేతరులు దోపిడీ చేస్తే
పొలిమెరల వరకు తరమమన్నడు
ప్రాంతం వాడైతే
పాతరేయమన్నడు
తెలంగాణ తత్వాన్ని
తనలో నింపుకున్న
మానవతావాది
కలాన్ని- కాలాన్ని- కాయాన్ని
ప్రజలకే అంకితం మిచ్చిన
మహెూన్నత మానవుడు
ఆయన కలల్ని పట్టుకొని
ప్రాణం పోద్దాం.........

**– పెరుమాళ్ళ ఆనంద్,**
నల్గొండ – 9985389506



# 32. సజీవ స్వరం

ఇజానికి కాకుండా నిజానికి కట్టుబడిన వాడు
సామాన్యుడి రాజకీయ ప్రతిబింబమై వెలిగిన వాడు
తవ్వినా కొద్దీ ఊట బాయి లెక్క
ప్రజాస్వామిక ఆలోచనలకు రెక్కలు తొడిగిన వాడు
అక్షర ఖడ్గంతో అన్యాయాన్ని ఎదిరించి
జన చైతన్యపు కాగడాగా జ్వలించిన వాడు
భావ గర్భితం రస భరితమైన కవిత్వాన్ని వెలువరించిన వాడు
నియంతల పట్ల నిరసన స్వరాన్ని నిత్యం వినిపించిన వాడు
తానే ఒక జీవనదిలా
ఎన్నో వాదాలను తనలో కలుపుకొని ప్రవహించిన వాడు
కష్టాలను చూసినపుడు ఆర్ద్ర హృదయం తో కన్నీరై కరిగిపోయిన వాడు
అన్యాయాలను అక్రమాలను గొంతెత్తి చాటడానికి వెనుదీయని సాహసి
హక్కులకై పోరుతున్న బిడ్డలకు పెద్ద దిక్కుగా నిలిచినవాడు
తెలంగాణ నిత్య సజీవ స్వరం కాళన్నను ఆవాహన చేసుకుందాం
ఆయన నింపిన స్ఫూర్తితో ఆయన అడుగులో అడుగేసి పయనిద్దాం.

**– ఉప్పల పద్మ,**
మిర్యాలగూడ,
నల్లగొండ – 8340933244.



# 33. నీ జీవితమే ఒక కాలేజి

కాళోజీ,ప్రజాసమస్యల అధ్యయన కాలేజి
ప్రజల భాషలో తెలుగును మలిచి
తెలంగాణ భాషకే అందాలు అద్ది
అవమానాలతో గొడవపడి
తెలంగాకోస ము ఆరాటపడి
అక్షరాలకు పోరాట స్ఫూర్తినిచ్చి
అన్యాయాన్నెదిరించే అలవాటు నేర్పిన
అమరజీవి!నిత్యనూతనరవీ! కాళోజీ.
సామాన్యమానవుణ్ణి,మావోను జాతకట్టి
మంచినేర్పేవాడు మనోడని తీర్పిచ్చి
మానవత్వం చాటిన మానవతావాది.
అన్యభాషల మీది మోజుతో స్వభాషనే మరిచి
తెలుగుభాష రాదని తెగేసి చెప్పే
తెలుగోళ్లను హెచ్చరించిన ధీశాలి!
సాహిత్యకారులకు,సామాజికదిక్సూచివై
రాజకీయరాకాసులకు, సింహస్వప్నమై
సంఘసంస్కరణాభిలాషులకు చైతన్యదీప్తివై
అహింసను నమ్మిన గాంధీని ఇష్టపడినా.
హింసామార్గంలో పోరాడిన భగత్ నారాధించిన
అది నీకే సాధ్యమయ్యింది.
అందుకే ఓ కాళోజీ!నీజీవితమే ఓ కాలేజి

**– వడ్డేపల్లి మల్లేశము,**
హుస్నాబాద్(చౌటపల్లి)
జి.సిద్దిపేట – 9014206412

# 34. కాళోజీ స్వరం



తెలుగన్నది కాళన్న శ్వాస
తెలంగాణ యాస తన ధ్యాస
అక్షరం ఆయన ఆయుధం
దోపిడి యెవడు జేసినా యెదిరించుడే
అన్న కాళోజీ స్వరం గరం గరం
మనిషి లోని మనసు తత్వం
మనసు లోని మనిషి తత్వం
కాళోజీ కవి తత్వం
ప్రజల పక్షం తన సాక్ష్యం
నిలదీయటం నిగ్గుదేల్చటం తన సహజత్వం
తెలంగాణ వ్యథ ఆయన యదలోని బాధ
ఆయన ధ్యాసంతా తెలంగాణా గోస పైనే
నప్పతసుకుల నసుగుడు నచ్చని
తెలంగాణ తెగింపు మన కాళోజీ
తెలంగాణ పోరులో గన్ను కాళోజీ పెన్ను
తెలంగాణ రంది తెప్పరిల్లేదెప్పుడని
ప్రశ్నించిన కాళన్న సిరంజీలోని సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక
యెప్పుడూ జీ హుజూర్ అనని కాళోజీ
తెలంగాణ దిక్సూచి మన పూజ్య గురూజీ
పుట్టుక నాది చావు నాది బ్రతుకంతా సమాజానిది
అన్యాయాన్నెధిరించినోడు నాకారాధ్యుడన్న
మహనీయునికిదే నా అక్షర నివాళి

**– మధు మోహన్ వుదయగిరి,**
బొడుప్పల్, హైదరాబాద్ – 9966460333

# 35. ధన్యజీవి



తెలంగాణ ఉద్యమకారుడు
రచించెనువారు నాగొడవ
గ్రంధాలయోద్యమ కారుడు
ధైర్యానికిలేదు వారిలోకొదవ
అక్షరమే వారిఆయుధం
సవ్యసాచి మనకాళోజి
ప్రజాహృదయమే వారిసౌధం
ప్రజాకవి మనకాళోజి
కాళోజీ జీవితం
పోరాటాలకే అంకితం
తనమతం ప్రజాహితం
ప్రజావాణి పలికెసమ్మతం
తెలంగాణ ఆణిముత్యం
వారిరచనలు మెచ్చినప్రజలు
పోరాటయోధుడు యిదిసత్యం
కదలివచ్చెను లక్షలప్రజలు
కవనమందు నాయకుడు
బహుభాషా కోవిదుడు
అలుపెరుగని శ్రామికుడు
కాళోజీ అక్షరయోధుడు

**– శ్రీమతి కె.శైలజా శ్రీనివాస్,**
విజయవాడ – 8019736254

# 36. మేల్కొలిపిన రవి...



చైతన్యాన్ని మేల్కొలిపిన రవి
బ్రతుకంతా పోరాడిన ప్రజాకవి
నీ సదనం తడియారని మడికొండ
నీ కవనం ప్రజల హక్కులకు దీకొండ
కరుణా గంగలు పొంగిన నీ గుండె
ఓకాళోజీ ! నువ్వు కాలంతో
నడిచిన కవివీ.....
తెలంగాణ గుండెల మీద
ఉద్యమాల జెండా వై ఎగిరావు
ప్రజల జీవితాన చరితవై నిలిచావు
అసలు కాళోజీ అంటేనే....
కలకాలం లోకంలో జీవించడం
కాళోజీ ఒక ఫినా మినన్
కళ్ళముందు జరిగేదంతా చూసి
ఏమి ఎరగనట్లు పడి ఉండే
సాక్షి బూతుణ్ణి కాదు
సాక్షాత్తు మానవుణని
మనిషి విలువ తెలిపిన
మహా నీయుడవు
కాళోజీ అంటే..?
ప్రశ్నించడం ఎదిరించడం
సమాజాన్ని సమస్యలను
అర్థం చేసుకోవడం
ఆపద సమయంలో
కరిగి కన్నీరై యిందు
కోపమొస్తే తానెత్తిన పిడికిలయిందు
లోకాన్ని లోతుగా చదివిందు
జీవితాన్ని మార్గంగా చూపిందు
దోపిడేవడు చేసినా
తన్ని తరుమాలని
ఎరుక చేసిన నిఖార్సైన కవి
కాళోజీ లో రస్సెల్ ఖలీల్ జిబ్రాన్
లూయీ ఓ వేమన్న
మనకు దర్శనమిస్తారు

– కోమటి రెడ్డి బుచ్చిరెడ్డి
నల్గొండ – 9441561655

# 37. ప్రభారవి



ప్రజల కవి కాళోజీ
ప్రభారవి కాళోజీ
స్వరాష్ట్ర సాధనకై
ముందు నడచిన కాళోజీ
ఉద్యమ సారథై
పలుమార్లు జైలుకెల్లిన కాళోజీ
ఒక్క సిరాచుక్కతో
లక్షమెదల్లను కదిపిన కాళోజీ
బ్రతుకు దేశానిదని
తెలంగాణ స్వేచ్ఛకోసం పోరాడిన కాళోజీ
జనుల గొడవంతా తనని
అన్యాయాలనెదిరించిన పద్మభూషణ్ కాళోజీ
తెలగాణ వైతాళికుడా
ఆదర్శ మూర్తి ,చైతన్య స్రవంతి
అందుకో మా హృది జ్యోతులు
ధన్యోస్మి కాళోజీ ! ధన్యోస్మి !

**– చౌకి.రాజేంద్ర**
కామారెడ్డి
9492474855,



# 38. ప్రజాకీయాలు

తెలుగు రాదనిన తెగ బాధ పడువాడు
ఈ తెగులు పోగొట్ట ఎరువుకై వెతికినవాడు
గజిబిజి పదాలను గమ్మత్తుగా కలిపినవాడు
పరభాషా పదాలకు కత్తెర వేసినవాడు
మాండలిక పదాలపై మక్కువ కలిగినవాడు
తెలంగాణ బాషను అక్కున చేర్చుకున్నవాడు
ప్రపంచాన్ని తన కవితలతో తడిపిన మనిషి
ప్రజా ఉద్యమాలను ముందుండి నడిపిన మనిషి
రాజకీయాలకు ఆయన నిర్వచనం 'ప్రజాకీయాలు'
బ్లాక్ మార్కెట్లు అంటే ఆయనకు"కుబేరాలు"
మనిషి మనిషిగా బ్రతకాలన్నదే ఆయన "గొడవ"
ప్రజా ఉద్యమాలలోనే సాగింది ఆయన "పడవ"..

**– పగిడిపాటి నర్సింహ,**
చిట్యాల,
నల్లగొండ – 9848668797

# 39. ముద్దు బిడ్డ



మడి కొండా ముద్దుబిడ్డ
వరంగల్లు నీకు అడ్డ
చేసితివి పనులు దొడ్డ
వీర తెలంగాణ బిడ్డ
ఉద్యమాలు చేసినాడు
ఉత్తమ పనులు చేశాడు
తెలంగాణ కోసమతడు
తెగించీ కొట్లాడినాడు
అన్యాయమును ఎదిరించెను
అక్రమమును ఎదిరించెను
సామాజిక సమస్యలను
చక్కగ పరిష్కరించెను
తెలంగాణ పోరు సలిపె
ఉద్యమాల ముందు నడిపె
అవినీతీ దుమ్ము దులిపె
అందరిని ఒకటిగ కలిపె
పేదోడే దేవుడనే
పెద్దరికమును వద్దనే
అహింసనే కోరుకునే
హింసయెప్పుడు తప్పనే
నిజాముురాజునెదిరించె
నిక్కచ్చిగ ప్రవర్తించె
జన చైతన్య మొనరించె
జగతిలోను పేరు గాంచె

– ఈర్ల సమ్మయ్య
తారుపల్లి, పెద్దపల్లి – 9989733035

# 40. జీవనాడి



ఊహ తెలిసిన నాటి
నుండే స్వార్థ పూరిత
మనుషులున్న నేటి కాలంలో.!
నిస్వార్థంగా నింగే హద్దు
కన్న ఊరిని వదిలి ఉన్న ఊరి
భాషకు ప్రాణంపోసిన ఘనుడు
తన తనువెల్లా మంచితనం
తన మాటలు మేలిమిబంగారం
తెలంగాణ యాసను
తన శ్వాసగా మార్చుకుని
అనుక్షణం అణువణువునా
తన గళం వినిపిస్తూ
నిజాం నిరంకుశత్వాన్ని
దోపిడీని తేట తెల్ల జేసిన
తెలుగోడు వెలగాలి..!
నింగిలో చంద్రుడై
చరిత్రలో త్యాగ ధనుడై
ప్రజల గుండెల్లో దేవుడై..!!


– **అక్షర వెంకట్,**
నాచారం,
నారాయణపేట – 8885566616



# 41. కారణజన్ముడు

కాళోజీ నీ జననం
తెలంగాణ తొలి పొద్దుకు అంకురం
నీ బ్రతుకంతా త్యాగాల మయం
నీ మరణం తీరని దుఃఖం.
పుట్టుక,చావు నీదే బతుకంతా తెలంగాణది
తెలంగాణ ఆశయంగా కవితలు సంధించావు
తెలంగాణకై స్వప్నించి అనునిత్యం తపించి
అడుగడుగున దిక్సూచిగా మారి
ఆజన్మాంతం కొట్లాడినావు
దిక్కులేని ఉద్యమానికి తోవవైనావు
దీపమై కరుగుతూ అనునిత్యం అక్షరసేద్యం చేసావు
దీనుల చైతన్యం కొరకు కాగడలా వెలుగొందావు
ప్రజల గొడవనే నా గొడవగా మార్చుకున్న ప్రజాకవి
ఎందరికో రాజకీయ భిక్షపెట్టావు
అభ్యుదయ భావజాలం అడుగడుగున అలుముకున్న సుకవి.
అందుకో సలాం! ఈ నేల నిన్ను మరువదు
ఈ జాతి నిన్ను మర్చిపోదు!
ఈ అక్షరం ఆరిపోదు.

**– శేఖర్ నీలం,**
మిర్యాలగూడ,
నల్గొండ. 9642357211

# 42. సూరీడు



ఉద్యమాలకు ఊపిరిగా నిలిచినోడు
ఉదయించే సూరీడు లా స్ఫూర్తినిచ్చినొడు
నిజాం పాలనపై తిరుగుబాటు చేసినోడు
జీవితమంతా పోరుబాట నడిచినో డు
ప్రత్యేక తెలంగాణను మరవని వాడు
కలం,గళంతో జనాన్ని చైతన్య పరచినోడు
సామాన్యజనానికి అండగా ఉన్నవాడు
నా గొడవతో జనం బాధలు చెప్పినోడు
తెలంగాణ యాసను,భాషను బలపరచినోడు
రజాకార్ల ఆగడాలను ఎదిరించిన యోధుడు
స్వాతంత్ర సంగ్రామంలో పాల్గొన్న వీరుడు
కారాగారశిక్షను అనుభవించిన ధీరుడు
ప్రజాసమస్యల పై నిరంతరం పోరాడే వాడు
సాహిత్యం ద్వార సమాజసేవ చేసినోడు
ప్రజలతో మమేకమైన ప్రజానాయకుడు
ఆకలి మంటలపట్ల ఆందోళన చెందినవాడు
అన్యభాషలోద్దు ఆంధ్రభాషే ముద్దన్నవాడు
మాతృభాషలో మాట్లాడటం మంచిదన్నవాడు
ప్రజాకవి కాళోజీగా జనం హృదయాలలో ఉన్నవాడు

– ఆచార్య గిడ్డి వెంకటరమణ,
అనంతపురం – 9440984416

# 43. వైతాళికుడు



ఆస్తులు లేనట్టి గొప్ప నిరాడంబరుడు
వివక్షత ఎక్కడున్నా వ్యతిరేకించిన వాడు
నిత్యం ఉద్యమాలతోనే ఉనికి చాటుకున్నవాడు
తాడిత పీడిత ప్రజల గుండెల్లో ఉన్నవాడు
కవితలతో ప్రజాకవిగ పేరొందిన వాడు
వారెవ్వా! సమాజ గొడవే నా గొడవ అన్నవాడు
అన్యాయమెక్కడున్నా ఎదిరించిన వాడు
రజాకార్లకు ఎదురేగి జైలులో ఉన్నవాడు
వహ్వా! తనకోసం కాకుండా ఇతరులకై బ్రతికినవాడు
వ్యవహారిక భాషకు ప్రాణమిచ్చినవాడు
తెలంగాణ యాసకు గుర్తింపు యిచ్చినవాడు
ఇంకా మంచి ఎక్కడున్నా హాయిగా స్వాగతించినవాడు
కాళోజీ మనతెలంగాణ వైతాళికుడు

**– వి.టి.ఆర్.మోహనరావు.**
పాల్వంచ, భద్రాద్రి కొత్తగూడెం జిల్లా – 9550340402

# 44. ఆరాధ్యుడు

కాళోజీ ఒక స్ఫూర్తి
ప్రభావ సమూహ శక్తి
తెలంగాణ ఉద్యమ ప్రతిధ్వని
చైతన్య సమాహారం సాంస్కృతిక సైనికుడు
మాండలిక భాషా ఆరాధ్యుడు
ప్రజా శ్రేయస్సే అంతిమ గమ్యం
అక్షరాయుధాలను సంధించిన "ప్రజాకవి"
పుట్టుక చావులను తెలంగాణాకు అంకితమిచ్చెను ధన్యజీవి

**– నాగిరెడ్డి అరుణ జ్యోతి,**
సూర్యాపేట, 9966181561

# 45. ఊట చెలిమె



బహు భాషా కోవిదుడు
సకల విద్యా సంపన్నుడు
తెలుగువారి గుండెచప్పుడు
ఉద్యమాలకు ఊట చెలిమె
నిజాం నిరంకుశ పాలనపై
ఎగిసిపడిన నిప్పుకణిక
ప్రజాకవి కాళోజీ
అన్యాయం, సమాజంలోని మలినాలపై
మాటల తూటాలను, కవితల మిసైల్స్ ను
విసిరి ప్రజలలో చైతన్య కిరణాలను,
పాలక వర్గానికి గుండె ల్లో గునపాలను
దించిన ధైర్యశాలి కాళోజీ.
ఒక సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక
అని అక్షర శక్తిని అవనికి చాటాడు
బడి పలుకుల భాష కాదు
పలుకుబడుల భాషకు పెద్దపీట వేసి
మాండలికానికి మాతృకైనాడు
సమాజ గొడవ తన గొడవగా చేసుకుని
పద్మవిభూషణుడై మెరిసాడు
ఆఖరికి తన పార్థీవ దేహాన్ని వైద్య
ప్రయోగాలకు దానమిచ్చిన
కలియుగ దానకర్ణుడు కాళోజీ

**– తాటిపాముల రమేష్,**
శివనగర్, వరంగల్ – 7981566031

# 46. ప్రతిధ్వని



తెలంగాణ కొరకు అక్షరాన్ని ఆయుధంగా
చేసి కలం ఎత్తి పోరాడిన ప్రజావాది
అన్యాయాన్ని ఎదిరిస్తే నాగొడవకు
సంతృప్తి యనుచు, అన్యాయం అంతరిస్తె
నా గొడవకు ముక్తి ప్రాప్తి అనిన ధర్మమూర్తి
తెలంగాణ ప్రజల గోసను అక్షర ధ్వనితో
పోరాడిన ఉధ్యమాల ప్రతిధ్వని
నిరంతరం ప్రజల కొరకు పోరాడిన ప్రజాకవి
ప్రజల మనిషి మన కాళోజీ
నిజాం దమన నీతి నిరంకుశ పాలనపై
కలం ఎత్తి పోరాడిన ప్రజావాది
అన్యాయాన్ని ఎదిరిస్తే నాగొడవకు
అన్యాయాన్ని ఎదిరించిన వాడే
నాకు ఆరాధ్యుడన్నాడు నీతిపరుడు
బడి పలుకుల భాష నొదిలి పలుకు బడుల
భాష మాట్లాడమన్న తెలంగాణవాది
అన్యభాషలు నేర్చి ఆంధ్రము రాదన్నవాడిని
సిగ్గులేక చావమన్న భాషాప్రియుడు
ఒక్క సిరాచుక్క వేయి మెదళ్ళకు కదలికంటూ
ప్రజలను చైతన్య పరచిన ఉధ్యమకారుడు
ప్రజల గోసను తన గొడవగా జెప్పి మానవతను మేల్కొల్పిన
మానవతామూర్తి
పుటుక నీది చావునీది బతుకంతా దేశానిది
అని దశభక్తిని చాటిన మహనీయుడు
పద్మభూషణముతో తెలంగాణ కీర్తి పెంచిన
తెలంగాణ వైతాళికుడు.

**– గంజి కళావతి శ్రీనివాస్,**
నల్లగొండ – 9912589703

# 47. మహనీయుడు



స్వాతంత్ర్యం సమరయోధుడు
తెలంగాణ వైతాళికులు కాళోజీ
వివక్షతకు వ్యతిరేకంగా పోరాడినవాడు
కలం బలంతో జనం గళాన్ని వినిపించిన చైతన్యశీలి
నా గొడవతో సమాజ కుళ్ళును కడిగేసిన ధీశాలి
ఓటు విలువలను విస్తృతంగా ప్రచారం చేసినవాడు
పీడిత తాడితుల ప్రజల పక్షపాతి
తెలంగాణ ప్రజల ప్రతీ ఉద్యమం ప్రతిధ్వని
నిజంనిరంకుశత్వం పై అక్షర ఆయుధాలను సంధించినవాడు
తెలంగాణ ఆర్తి,ఆవేదన,ఆగ్రహం వారి గేయాల్లో రూపుదిద్దుకొంటాయి
హింస తప్పు  రాజ్యహింస మరీతప్పని చాటినవాడు
సామాన్యుడే నా దైవం అని ప్రకటించినవాడు
బతుకునంతా తెలంగాణకు నిచ్చిన మహనీయుడు

**– వేమూరి కమలాకర్ సుజాత**
రాజేంద్రనగర్,
రంగారెడ్డి జిల్లా
8801197747

# 48. అక్షరజ్యోతి



తనది ధిక్కార స్వరం
తెగువ నేర్పినా
తెలంగాణలో
అక్షరాల అగ్నికణం
ఆకలి కడుపుల
రోకలి పోట్లను
అలిసిన దేహం
ఒడిసిన చెమటకు
అక్షరాలతో
అద్దం పట్టిన
ఉక్కునరాల
ఉద్యమ కెరటం
అన్యభాషలలో
అక్షర జ్యోతి
అమ్మ భాషకు
తెచ్చిన ఖ్యాతి
నిరంకుశత్వపు
నిజాం కత్తి
నిగ్గు తేల్చినా
నిత్య వీరుడు
కలం కదిపితే
పదాల కడలి
గళం విప్పితే
స్వరాల మురళి
మెతుకులు లేని
బతుకుల కోసం
యాస భాషలో
యుద్ధం చేసి
భావి తరాలకు
బాటలు వేసిన
భావ కవి భాష కవి
తెలంగాణ అచ్చమైన
ప్రజాకవి... అతడే
కాళోజీ నారాయణ రావు...

**– ఎనుపోతుల వెంకటేష్,**
ఉడిమిల్ల
9573318401.

# 49. చైతన్యదీపిక



తెలంగాణలో
చైతన్య దీపికను ప్రసరించి
అన్ని వర్గాలకు అక్షరజ్ఞానం
వాడుక భాషను పంచి
ప్రజల భాషకు పట్టం గట్టిన ప్రజాకవి కాళోజీ
బానిసత్వపు బాధలు బాపుటకు
ఉద్యమమే ఊపిరిగా బతికిన
సంఘసంస్కర్త
భూస్వామ్య వ్యవస్థను భూస్థాపితం జేయ
కలమే కరవాలంగా యుద్ధం జేసిన
కలం యోధుడు కాళోజీ
రాజకీయ సాంఘిక చైతన్య సారథి
విగ్రహారాధనను నిరసించిన అభ్యుదయవాది
సామాన్యుడి హక్కులడిగిన ప్రజల మనిషి.

**– రాజశేఖర్ పచ్చిమట్ల,**
గోపులాపూర్
జగిత్యాల జిల్లా
9676666353

## 50. వందనం



ఎవరి యాస వారికే గొప్ప,
ఏళ్లుగా అణగారిన భాష తెలంగాణ యాస,
మనయాసలో మనం
మాట్లాడుకునే స్వేచ్ఛ వచ్చేసింది నేడు,,
తెలంగాణ వేషభాషలతో తొలుచూరు బిడ్డ
ఈ శతాబ్దపు మేటి కవి
నిజాం పాలనకు అవినీతికుళ్లు
కుతంత్రాలకు వ్యతిరేకంగా
గళమెత్తిన తెలంగాణ ప్రజాకవి
కాళోజీ మీకు ఇవే మా శతకోటి వందనాలు...

**– ఎం ఎన్ విజయ్ కుమార్,**
పాలమూరు జిల్లా – 944108903539.

## 51. ఉద్యమ ఊపిరి

తెలంగాణ తొలిపొద్దు కాళోజీ
నిజాం నిరంకుశాత్వానికి వ్యతిరేకంగా
కలం ఝుళిపించిన ధీరుడు
తెలంగాణ ప్రజల ఉద్యమ ప్రతినిధి
సాంఘిక చైతన్యలా సమాహారం
పుట్టుక,చావు కాకుండా
బ్రతుకంత తెలంగాణ కు ఇచ్చిన మహనీయుడు
జనం భాషకు జై కొట్టిన..కాళోజీ
హక్కులు అడిగిన ప్రజల మనిషి
సగర్వంగా ప్రకటించిన ఆశావాది కాళోజీ
ప్రజాకవి,ఉద్యమ నేత ఉద్యమమే ఊపిరిగా నిలిచిన కాళోజీ

**– గాజుల.భారతి శ్రీనివాస్,**
ఖమ్మం – 9849788108

## 52. ప్రజావాది



తెలంగాణ తొలి పొద్దు
సాంఘిక చైతన్యాల సమాహారం
హక్కుల నడిగన ప్రజల మనిషి
హక్కుల కోసం ఉద్యమం నడిపిన ప్రజావాది
నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడిన వాడు
స్వాతంత్ర్య సమరయోధుడు
తెలంగాణా ఉద్యమకారుడు
ఉద్యమమే ఊపిరిగా జీవించిన ప్రజాకవి
కాళోజీ నారాయణరావు..

**– నల్లి.సాయిబాబు,**
సీతారాంపురం, పశ్చిమ గోదావరి, ఆంధ్రప్రదేశ్
9908454667, 8500144889

## 53. జీవనవేదం

తెలంగాణ యాస భాషలోన కాళోజి
అలుపెరుగని భాటసారి ఎంతటి వారికైనా
ఎదురునిల్చి నిగ్గుతేల్చే సాహసి
భాషయాసలకు పట్టముకట్టిన ప్రజల మనిషి
ప్రజలకోసమే తన కలం గళం
ఎక్కడ ఉద్యమం ఉంటె అక్కడ కాళోజీ
కార్మికకర్షకలోకానికి అండగా నిల్చెను కాళోజి
వ్యవహారికవాదంలో జీవనవేదం కాళోజి

**– ముడుంబై ఆచార్య పద్మశ్రీ,**
రామచంద్రాపూర్, సంగారెడ్డి – 8374666857

# 54. కాళోజీ శ్వాస



తెలుగువారి భాష తెలంగాణ యాస,
భాష ఒక్కటైనా యాస గోస ఏంది
భాష రెండు తీర్లు  – బడి పలుకుల భాష, పలుకుబడుల భాష
అన్య భాషల నేర్చి ఆంధ్రమ్ము వదిలితే చావమన్నాడు
భాషలెన్నో కలియబెట్టిండు, మాతృ భాషకు కిరీటంబెట్టిండు
పరాచకాలు పరికించినాడు, మన యాసకు పట్టంగట్టిండు
కాళన్న తెలంగాణ భాషా దినోత్సవ దీప్తి అయినాడు.
కాళన్న తెలిపిండు కానీ లేని కాలే కడుపుమంట
సామాన్యుడే నా దేవుడని చెప్పాడు వారి గొడునెల్ల ఎల్లబోశాడు
నిజాములకు, రజాకార్లకు ఎదురొడ్డి నిలిచిండు
ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక యన్నాడు
ప్రజలను చైతన్యపరిచి ప్రజా కవిగా వెలిగిండు
అన్యాయాన్నెదిరించడమే “నా గొడవ” అన్నాడు.
స్వాతంత్ర్య సమరాన సమిధగా మారిండు, జైలు పాలైనాడు
వరంగల్లు కోటపై జాతీయ పతాకమెగరేశాడు
కలము బట్టి కదనమే జేసిండు, తెలంగాణ కదనమే జేసిండు
అహింసా జ్యోతిగా నిలిచినాడు, బాపూజీ బాటలో నడిచినాడు
ఊరూరా గ్రంథాలయోద్యమం నడిపిండు
ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపించినాడు
పద్మ విభూషనుడై భారతావని మెరిసిండు.
తెలంగాణ గోడు వినిపించిన సరిజోడు,
తెలంగాణ పోరు ఊపిరై నిలిచాడు
తెలంగాణ తోనే శాంతి నాకన్నాడు, తెలంగాణ కొరకే పుట్టుకా చావన్నాడు
తెలంగాణ సాధనే ఊపిరన్నాడు, తెలంగాణ కలతోనే ఊపిరొదిలాడు
తెలంగాణ కవి కాళన్న ఊపిరొదిలాడు
వారికివే నా కవితాభివందనాలు.

**తుమ్మ జనార్ధన్,**
దిల్ సుఖ్ నగర్, రంగారెడ్డి జిల్లా – 9440710501

# 55. అన్వేషణ



నిన్ను వెతుకుతుంటే..సంద్రమనే జీవితకెరటాల్లో కొట్టుకుపోయి,
ముత్యాల కోసం వెతికినట్టుంది!!
నీ కోసం నీ వార్త కోసం
విలేకర్ల విలాపాన్ని, దినపత్రికల దీనాలాపాన్ని
నేను సహించలేను!!
ఇంతకూ ఉన్నావా నువ్వు?
నువ్వుండేది మనిషి లోనా? లేక మృగం లోనా?
పాత వస్తువులను అగ్ని దహించినట్లు
కొంపదీసి నువ్వు కూడా కాలిపోయావా యేమి??
రానూ రానూ రచయితల రాతలకు
కవుల కవితలకుమాత్రమే  పరిమితమౌతావేమోనని భయమేస్తోంది!!
మనిషిలో కనిపించే మనిషిని కని పెంచే  ఓ మానవత్వమా!
జర అందరిలో వెలుగుమా!!

**– మ్యాడం అభిలాష్,**
జాజాపూర్, నారాయణపేట – 8142576346

# 56. యోధుడు

కవిత్వం రాసిన ప్రజాకవి
హక్కులడిగిన ప్రజామనిషి
తెలంగాణ  కాళోజి
నిజాం దమననీతికి కలం ఎత్తిన కాళోజి
హక్కుల ఉద్యమానికి ఊపిరి పోశిన యోధుడు
నిజాం వ్యతిరేకంగా తీవ్రస్వరంతో కవితలు రాశిందు
నిజాం దుష్కృత్యాన్ని కాళోజి దిక్కరించిందు

**– చాపల. భాస్కర్,**
మాణిక్యపురం, జనగాం, 6301089521



# 57. వెలుగు

తెలంగాణ తల్లి ముద్దు బిడ్డ కాళోజి
తెలంగాణకు యాసకు ప్రాణమునీవు
నీ రచనలు మాకు ఆదర్శము కాళోజి
నీరచనలు చైతన్యవంతమైనవి
నీమాటలు ప్రజలకు ధైర్యము
ప్రజాకవి కాళోజి
నాగోడవ రచన చైతన్యరూపం గలది
ఇది మాకు ప్రదానము
తెలంగాణకు వెలుగువు కాళోజి
నీరచనలతో నిజాం గుండెలో భయం
కలిగించిన ప్రజాకవి కాళోజి
నీవు మాకు మార్గదర్శకము
నీకు వందనము ప్రజాకవి కాళోజి
తెలంగాణతల్లికి ధైర్యము నీవు

**– పసుపునూరి భుజేంధర్,**
నిర్మల్ జిల్లా
9703557271



# 58. ప్రజాకవి

నైజాం పరిపాలనకు వ్యతిరేకంగా
తన స్వరంతో కవితలు రాసిన కవి
హిందీ మరాఠీ ఉర్దూ భాషలలో పండితుడు!!
ఇతర భాషల గ్రంధాలను తెలుగులోకి అనువదించిన కవి!
ఎన్నో ఉద్యమాల్లో పాల్గొని ,అన్యాయాన్ని ఎదిరించే వాడు!
నైజాం వ్యతిరేకంగా పోరాడి జైలు జీవితం గడిపిన
విప్లవకారుడు!!
పోరాడే తత్వం సామాజిక స్పృహ , ప్రజలగుండెల్లో కొలువైన కవి!
తెలుగు హిందీ మరాఠీ ఉర్దూ భాషలోగొప్ప కవి!!
పుట్టు చావు కాకుండా బ్రతుకంతా తెలంగాణకిచ్చిన మహా కవి!
తెలంగాణ యాసను చూపినమహనీయుడు..... ప్రజాకవి....

**– సింగీతం సంతోష్ కుమార్,**
రుద్రారం, ఎల్లారెడ్డి, కామారెడ్డి,
తెలంగాణ – 8897152205



# 59. మానవతావాది

తెలంగాణ ఉద్యమ సారథ్యం కాళోజి!
తెలంగాణా ప్రజల దీనావస్థను దర్శించి
నా గొడవంటూ నిరవధిక నిరసన
అక్షరాస్త్రాలను ఎక్కుపెట్టిన ప్రజా కవి!
'పుట్టుక నీది చావు నీది
బతుకంతా సమాజానిదే'
సమాజ శ్రేయస్సుకై అవిరళ కృషి చేసిన ఉదాత్తమ సేవకుడు!
నిజాం నిరంకుశత్వం అరాచక పాలనపై తిరుగుబాటు చేసిన ఉ
ద్యమకారుడు
ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలికని నినదిస్తూ
స్వాతంత్ర్యోద్యమంలో నిరసన గళం వినిపించిన కవి!!
ఎవరి వాడుక భాష వారిదే
బడి పలుకుల భాష వలదు
పలుకు బడుల భాష శ్రేయస్కమని నినదించిన అఖిలాంధ్ర కవి!
పద్మ విభూషణ్ అవార్డుకు వన్నె తెచ్చి
జనరంజక చెరగని ముద్ర వేసుకున్న కాళోజీ
ఓ మానవతా దృక్పథం
తన మృతదేహాన్ని వైద్య కళాశాలకు అర్పించిన
కాళోజీ త్యాగం అమరం!

**– సయ్యద్ జహీర్ అహ్మద్,**
కర్నూలు – 9505152560

# 60. తొలిపొద్దు



నిజాం దమన నీతికి నిరంకుశత్వాన్నికి
తన గళాన్ని కలాన్ని విప్పిన మాటల మాంత్రికుడు..
తెలంగాణ వేరైతే దేశానికి ఆపత్తా? తెలంగాణ
వేరైతే తెలుగు భాష మరుస్తారా? యని
తెలంగాణ గొంతును వీధి వీధినా
వినిపించిన తెలంగాణ విప్లవ సూరీడు..
రెండు జిల్లాల భాష తెలు గైతే
ఆ తెలుగు నాది కాదు యని తెలంగాణ భాషకు
యాస కు పట్టం కట్టిన తెలంగాణ భాష పితామహుడు..
రాజకీయ సాంఘిక చైతన్యపు వారధి,
తెలంగాణ ప్రజల ప్రతి ఉద్యమ ప్రతిధ్వని,
అన్యాయం అంతరిస్తే నా గొడవకు ముక్తి ప్రాప్తి
కలుగుతోందని భీషణప్రతిజ్ఞ చేసిన
తెలంగాణ భీష్మ పితామహుడు..
సాగి పోవుటె బ్రతుకు, ఆగిపోవుటే చావు
సాగిపోదలచిన ఆగరాదిచటెపుడు
అంటు తెలంగాణ ప్రజలను
నిత్యం చైతన్య పరచిన తెలంగాణ తొలి పొద్దు..
తెలంగాణ పోరాట యోధుడు,
అక్షర శ్రామికుడు, కలమునే కవనముగ
ధరించి దుష్టులను దునుమాడిన వీర కాళోజీ,
మీ జీవనమే మాకు గమనం గమ్యం,
మీ పోరాటమే మాకు బలం భాధ్యత,
మీ స్ఫూర్తి యే మాకు అండ దండ,
మీ గొడవ యే మాకు మంత్రం తంత్రం,
మీ సిరా చుక్క యే మా లక్షల మెదళ్ళకు కదలిక, జై తెలంగాణ...

– ప్రవీణ్ శర్మ,
బాల్కొండ, నిజామాబాద్ జిల్లా – 9553576697



# 61. స్ఫూర్తి

తెలంగాణ ప్రజల ఉద్యమ ప్రతిధ్వని
రాజకీయ చైతన్య సమాహారం
హక్కులడిగిన ప్రజల మనిషి
కవిత్వం వ్రాసిన ప్రజాకవి
బతుకంతా తెలంగాణకు ఇచ్చిన కాళోజీ
నిజాం దమన నీతిని
నిరంకుశత్వాన్ని
అరాచక పాలననీ
వ్యతిరేకించి కళం ఎత్తినాడు
గ్రంథాలయ ఉద్యమంలో
పాల్గొన్న కాళోజీ
తెలంగాణ ఉద్యమం కారుడు
పద్మ విభూషణ్ పురస్కార గ్రహీత
అసలు సిసలైన తెలంగాణ వాది
సాహిత్య రాజకీయాల్లో మార్గదర్శి
తెలంగాణ తొలిపొద్దు కాళోజి
తెలంగాణ భాషా దినోత్సవాన్ని
కాళోజీ పట్టినరోజుగా జరుపుకుంటూ
వరంగల్లు లో వైద్య విశ్వ విద్యాలయం
కాళోజీ గుర్తుగా నామకరణంతో
తెలంగాణ ప్రజలకు స్ఫూర్తిగా జీవించిన కాళోజీ

**– డా.ఆలూరి విల్సన్,**
నల్గొండ
9396610766

# 62. హృదయవిజేత



తెలుగు భాషా నవ వైతాళికుడు
తెలంగాణ యాస గోస శ్వాసికుడు
తెలుగు భాషా భవ్య భావోద్వేగం
తెలంగాణ వ్యధల కవన శ్రామికుడు
తెలుగు వాళ్ళ వెలుగు తీపిగుర్తు
తెలంగాణ తిరగబడ్డ గొంతుక
తెలుగు భాషా వెలుగు వైభవం
తెలంగాణ పోరాట వీరసింహం
తెలుగు అక్షరాల వెలుగు దీపం
తెలంగాణ దొరతనానికి సింహస్వప్నం
తెలుగు తేజమ్ము తేజరిల్లిన తేజం
తెలంగాణ మాగాణిలో దున్నే నాగలి
తెలుగు భాషాపొదిలో అద్భుత అక్షరం
తెలుగు భాషా సిగలో మొగలిపూవు
తెలంగాణ జన జావళిలో నవజాబిలి
తెలుగు పనస తొనల తియ్యదనం
తెలంగాణ పదరవళిలో నిత్య మంజీర
తెలుగు వెన్నెలలో మెరిసే ధ్రువతార
తెలంగాణ యాదిలో హృదయ విజేత !!

**– డా. పూసల లింగాగౌడ్**
సంగారెడ్డి
9441424199

# 63. పూజ్యకవి



నిజాం నిరంకుశ పాలనపై ధ్వజమెత్తిన ప్రజాకవి
హక్కులడిగిన ప్రజల మనిషి,
ఉద్యమం నడిపిన ప్రజావాది,
తెలంగాణా జీవనపు చలనశీలి,
గ్రంధాలయ ఉద్యమంలో చురుకుగా పాల్గొని,
హైదరాబాదు స్టేటు కాంగ్రెస్ తో విడదీయరాని
బంధం కలిగి, తెలుగాణా రచయితల సంఘం ఉపాధ్యక్షునిగా,
ఉపాధ్యాయు నియోజక వర్గం నుంచి శాసనమండలికి ఎన్నికై
ఎన్నో పదవులతో, ఎన్నో సంఘాలతో సంభందుడవై,
హింస తప్పు, రాజ్యహింస మరీ తప్పని చెప్పి
సామాన్యుడే నా దేవుడని ప్రకటించిన
దేశపు రెండవ అత్యున్నత పురస్కారం
పద్మవిభూషణుడై, పరమపదించిన
పూజ్య ప్రజాకవికి పుష్పాభిషేకం.

**– లోకనాధం సత్యానందం,**
శ్రీకాకుళం
9182863928

# 64. ఉద్యమ కవి



ఉద్యమం నడిపిన ప్రజావాది
స్వాతంత్ర సమర యోధుడు
ఉద్యమ కవితలల్లినాడు
తెలంగాణ ఉద్యమకారుడు!
నిజాం దమన నీతి పై నిప్పుచెరిగె
తన జన్మదినాన్ని ప్రభుత్వము
నిరంకుశత్వాన్ని ఎదిరించినాడు
జరుపుకొంటోంది భాషా దినోత్సవం!
న్యాయ శాస్త్రము నందు పట్టా పొందేను
రజాకార్లను ఎదిరించినాడు
నాగపూర్ విశ్వవిద్యాలయం చేరి
జైలు శిక్ష అనుభవించినాడు!

**– ఆరెకటిక నాగేశ్వరరావు ,**
ఎమ్మిగనూరు.కర్నూలు – 9492612699

## 65. జీవధాతువు



ఆడంబరాలు లేని నిరాడంబర జీవితం నీది
ఆచరణలో పెట్టేది ఆదర్శంగా నిలిచేది
నిరంతరం ఉద్యమ జీవి అయిన నీవు
అనేక ఉద్యమాల్లో పాల్గొని ప్రశ్నించావు.
రజాకార్లను ఎదిరించిన యోధుడవు
జైలుజీవితం గడిపిన వీరుడవు
ప్రత్యేకరాష్ట్ర సాధనలో శూరుడవు
అలుపెరుగని పోరాటం జోధుడవు.
తెలంగాణ పక్షాన నిలిచావు
పీడితప్రజల గుండెలను కొలిచావు
తెలంగాణ సాహిత్య పురుషుడవు
ప్రజాకవిగా పేరొందిన ఘనుడవు.
సమాజ గొడవను నాగొడవగా చేసుకుని
సాహిత్య ప్రక్రియకు వన్నె తెచ్చావు
ఉద్యమాలతో మమేకమై కవిత్వాన్ని చాటారు.
తెలంగాణ వైతాళికులని పేరొందారు.
వ్యవహారిక భాషయే జీవభాషంటివి
మాండలికం జీవధాతువంటివి
వ్యక్తిత్వం స్వేచ్ఛ ప్రధానవిషయాలు నీవి
నిర్భయంగా మాట్లాడే స్వభావం నీది.
గుర్తెరిగిన సెప్టెంబరు తొమ్మిదివ
తెలుగువారి మదిలో నిలిచిన
కావాలి మనకు అది పండుగ
మాతృభాషకు మమతలెరిగిన

**– బలిజపెల్లి కిషన్**
మంచిర్యాల– 9849151174

# 66. అక్షర తూటా



కవన సామ్రాట్ కాళోజి
ప్రజాస్వామ్య ఉద్యమ దళపతి,
తెలంగాణ ఆత్మగౌరవ సాహితీ తొలిపొద్దు,
అక్షర జ్యోతికై అహర్నిశలు
శ్రమించిన భాషాజ్యోతి,
నా 'గొడవ' పేరిట సమకాలీన సమస్యలపై,
అక్షర తూటాలు సంధించిన సాహసి,
ఆంధ్రంబు రాదన్న వానిని,
చావవెందుకురా అని ,
తెగిడిన తెలుగు భాషా పిపాసి,
సామాన్యుడే దేవుడన్న
అసామాన్యుడు,
తెలంగాణకై జీవితాన్ని
ధారపోసిన,
ఆద్యంతము మడమ తిప్పని
పోరాటయోధుడు,
అట్టి కాళన్న జయంతోత్సవమే,
నేటి తెలంగాణ
భాషాదినోత్సవం

– **మిద్దె మురళీకృష్ణ,**
అనంతపురం,
9985590196

# 67. గౌరవం



భాష అంటె ప్రాణంగా బతికేటోడు
పలుకుబడి గల భాష గావాలన్నడు
యాస అనేది చాలా గొప్పగ ఉంటదన్నడు
మన భాషను తక్వ చెయ్యొద్దు అన్నడు.
యాస గురించి గిట్లనే మాట్లాడాలన్నడు
నేను గిట్లనే మాట్లాడుతన్నడు
జిద్దుకు రాయాలన్నడు
భానిస భావన పోవాలన్నడు .
పుట్టిన గడ్డపై మన భాష మాట్లాడమన్నడు
అన్యభాషలు మాట్లాడడానికి సిగ్గు పడమన్నడు
మన యాసను అమ్మగా భావించమన్నడు
అమ్మ భాషకు గౌరవం ఇవ్వమన్నడు

**– గిరియప్పగారి నాగలక్ష్మి ,**
హస్నాబాద్,
సంగారెడ్డి – 9502261583

# 68. గుండె చప్పుడు



పలుకు బడుల భాషలోనే
పలకాలి ప్రజలంటూ
ప్రజా హక్కు పోరాటాలకు
ఉద్యమ బావుటాలా ముందు నడిచి
ప్రజల న్యాయం నా గొడవంటూ
గొడవైనా పర్వాలేదు పరేషాను అసలు లేదు
పయిలం మన హక్కులంటు
పక్కాగా అలుపెరుగక నడిపించి
తెలుగు మాట  ముద్దు అంటూ
మనకొచ్చిన భాషలోన ముచ్చటే చేయమంటూ
సిగ్గుపడకు బిడియపడకు
తీయనైన మాట మనది
తిరుగులేని బాటమనది
జాతి మొత్తం గర్వపడే
నేతగా తా నిలిచిపోయే.

**– రాజ్యలక్ష్మి  ఎ చేవ్రాల,**
చెన్నై – 9487486985



# 69. అభ్యుదయ కవి

సామాజిక సమస్యలకు
అక్షరాయుధం సంధించెను
అరాచక పాలనకు
వ్యతిరేకంగా పోరాడెను
రజాకార్లను ఎదురించి
జైలుజీవితం గడిపెను
నిజాంరాజును ఎదురించి
ఉద్యమాలు చేసెను
ఉద్యమమే ఊపిరిలా
జీవించిన ప్రజాకవి
తెలంగాణా జీవితచలనశీలిలా
వెలుగొందిన గొప్పకవి
ప్రజా కవిత్వములతో
అభ్యుదయం గావించెను
ఎన్నెన్నో పురస్కారములతో
చరిత్రలో నిలిచెను

**– సాకివార్ ప్రశాంత కుమార్,**
ఉట్నూర్,
9381475331



# 70. సమర శీలి

ఆయన మాటలు తుపాకి తూటాలు
ఆయన మాటలు  గలగలా పారే సెలయేటి  సవ్వడులు
'సర్వేజనాసుఖినోభవంతు' అతని లక్ష్యం
జాతీయోద్యమంలో పాల్గొన్న సమరశీలి
పాలకుల దుర్నీతిని ఎండగట్టిన
సామాజిక ఉద్యమకార్యకర్త
అన్నిటికి మించి కరుణార్ద్రహృదయుడైన కవీశ్వరుడు
పార్టీప్రత్యము, ప్రజాకీయాలువంటి
నూతనపద ప్రయోగాల సృష్టికర్త
మాతృదేశ ప్రాశస్త్యాన్ని చాటిచెప్పినకవి
మాతృభాషకు మరే భాషా సాటిరాదని
మాతృభాషపై అభిమానం చాటిన కవి
అధిక్షేప,వ్యంగ్య కవిత్వంలో సిద్ధహస్తుడు
ప్రజా సమస్యల కోసం కవిత్వాన్ని ఆయుధంగా
మలచి ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిన సంకల్పవాది


**– పి.హజరత్తయ్య,**
సింగరాయకొండ,
ప్రకాశం జిల్లా,
ఆంధ్ర ప్రదేశ్ – 9848606573

# 71. మహనీయుడు



కాళోజీ జీవితము!
ఉద్యమ ప్రతిబింబము!
ఆయన ఊపిరియే!
తెలంగాణ ఉద్యమము
వివక్షత వ్యతిరేకించాడు!
మంచిని స్వాగతించాడు!
అన్యాయాన్ని ఎదురించె!
తెలంగాణ మహనీయుడు!
కాళోజి యొక్క ప్రజాకవి!
ప్రజల మదిలో మహకవి!
ప్రజల పక్షాన నిలిచిన!
నిరంతర ఉద్యమ జీవి!
ప్రజల యొక్క గొడవను!
తను నా గొడవ గాను!
ప్రజా కవి కాళోజి గారు
అతనే భావించెను!
కాళోజి కవిగాను!
అతనే కథకునిగాను!
కాళోజి రాణించాడు!
ఉద్యమ కారునిగాను!

– బీరప్పొల్ల అనంతయ్య,
శేరిగూడ,రంగారెడ్డి
9676546633

# 72. జ్వాల



స్వాతంత్ర్య సమరంలో పాల్గొని
జైలు జీవితం అనుభవించిన వాడు కాళోజి
పుట్టుక నీది,చావు నీది
బ్రతుకంతా దేశానిదని చాటి
చెప్పిన మన ప్రజాకవి కాళోజీ
ప్రజల మనిషి కాళోజి
ప్రజల గొంతుకలో విప్లవ జ్వాలలు,చైతన్య గీతాలు రగిలించి
తెలంగాణ ఉద్యమాన్ని ముందుకు నడిపిన వారు
నిజాం నిరంకుశ పాలననరికట్టి
పోరాడిన పోరాట వీరుడు మన కాళోజీ
కాళోజి చేతిలో కలం
అక్షరాల నిలువుటద్దం
ప్రజా పోరాటాలకు,అక్రమాలకు
అక్షరదళంతో ముందుకు సాగినవాడు కాళోజి

**– రాచమల్ల రేవతి,**
ఉరుమడ్ల,
నల్గొండ – 7036362338

# 73. క్రాంతదర్శి



తెలంగాణ తొలిపొద్దు
అక్షర ఆయుధం సంధించిన ప్రజాకవి
నిజాం నిరంకుశంపై ఉద్యమ వైతాళికుడు
అరాచక అకృత్యాల నెదిరించిన ధీరుడు
పీడిత తాడితుల ప్రజా పక్షపాతి
నా గొడవతో కుళ్ళును కడిగిన ధీశాలి
తెలంగాణ యాస భాషకు పట్టం కట్టే భాషాశ్రీ
కలం బలంతో జనగళం వినిపించే చైతన్యశ్రీ
ఒక్క సిరా చుక్క జనస్ఫూర్తి నింపిన కవన శ్రీ
ఓరుగల్ కోటపై త్రివర్ణ పతాకం  నిలిపే క్రాంతదర్శి
దేహ అవయవదానంలో ఆదర్శుడవు
ఆధిపత్య రాజకీయాలకు ఇంకెన్నాళ్లు  విసిరే సవాళ్లు
కుల మత వివక్షకు వ్యతిరేక ప్రజా మనిషి
ప్రజా కవిగా ప్రజా గుండెల్లో నిలిచే ఆరాధ్యుడు
తెలంగాణ సాధనకై రాజీలేని పోరాట వీరుడు
జీవనగీతితో జనుల మదిలో పద్మభూషణ కాళోజి

**– తుమ్మా రాజా,**
కోదాడ, సూర్యాపేట జిల్లా
8099918883

# 74. సుమాంజలి



ఆయనొక చైతన్య కిరణం
అన్యాయాన్ని ఎదురించడం ఆయన వైనం
వెనకడుగు వేయకపోవడం ఆయన నైజం
ఉద్యమం వైపు ఆయన పయనం
అహింసా సిద్ధాంతం ఆయన మార్గం
నిత్య సత్యాగ్రహ నిస్వార్థపు ఉద్యమకారుడు
సిరా చుక్కతో లక్షల మెదళ్లను ఆలోచింపజేసిన
అక్షరయోధుడు
ఆ నిర్మల హృదయానికి
నా అక్షర సుమాంజలులు!!


**–ఆకుల వెంకటరమణ,**
నసర్లపల్లి,
నల్గొండ జిల్లా
9441717212

# 75. ఆరుట్ల కమలమ్మ



మంతపురిలో పుట్టినావు
మంత్రినిగా ఎదిగినావు
రామచంద్రయ్య తోడుతో రంగంలో వెలిగినావు
ఉద్యమానికూపిరైతివీ కమలమ్మా
వనితల కుత్తేజమిస్తివీ కమలమ్మా ।।ఉద్యమాని।।
పురిటిబిడ్డ నొదిలినావు
పున్నమిలా వెలిగినావు
రజాకార్ల నెదిరించి , గెరిల్లాయుద్ధంలో ముష్కరులతొ పోరాడి
మహిళలలో మణివైతివీ
కమలమ్మ వీరనారీవైతివి ।।మహిళలలో।।
ఆంధ్ర సభలకాజరై
నిజామునే ఎదిరించీ
విమోచనకై పోరాడి
చెరసాల పాలైతివీ కమలమ్మా
ధైర్యనికి ఆయుదమైతివీ కమలమ్మ ।।ధైర్యానికి।।
ధైర్యసాహసాలలో ఝాన్సిలక్ష్మిని మరిపించి
విప్లవ స్ఫూర్తికి ప్రతికగా ఎదిగావు
శాసన సభలో స్త్రీ శక్తిగ నిలిచావు
కాకతమ్మ ఒడినుండి డాక్టరేటు పొందావు
వీరవనితవైతివీ కమలమ్మ ధీరులలో ధీరవనితావైతివీ
రాణిరుద్రమలా కీర్తి శిఖరమొందినావు
సాయుధసమరంలో సాహసం చూపినావు
తెలంగాణ తల్లికై తెగించిన బిడ్డవై
అమ్మలగన్న అమ్మ వైతివీ కమలమ్మ
ఆడపిల్లలకణుసరైతివీ కమలమ్మ ।।ఆడపిల్లల।।

**– డా. బండారి సుజాత,**
హన్మకొండ, వరంగల్ అర్బన్ – 9959771228

## 76. ధీరవనిత



భూమి నాది..పంట నాదంటూ
మాటల్ని తూటాలుగా మరల్చుకొని
దొరల అరాచకం పై గర్జించిన వీరవనిత.. ఆమె
తెలంగాణ గడ్డ మీద ఉదయించిన పోరుబిడ్డ..ఆమె
భూపోరాటానికి నాంది పలికి
నిజాం నిరంకుశత్వాన్ని, రజాకార్ల అరాచకాలను,
దేశముఖ్ ల దోపిడీలను
అడ్డుకున్న ఓ అగ్నికణం.. ఆమె
పెత్తందారుల పెత్తనాన్ని ధిక్కరించి
ఆడదంటే అబల కాదని నిరూపించిన ఆదిపరాశక్తి.. ఆమె
"బాంచెన్–కాల్మొక్తా"అనే జాతిలో తలెత్తిన సివంగి.. ఆమె
ఆత్మవిశ్వాసాన్ని ఆయుధంగా చేసుకొని
మొక్కవోని ధైర్యంతో ముందుకు సాగితే
గెలుపు మనదేనన్న స్ఫూర్తిని అశేష పీడిత ప్రజానీకానికి అందించిన
ధీరవనిత..ఆమె
ఆమె పోరాటమే భావితరాలకు స్ఫూర్తి..
ఆమె ఎవరో కాదు..మన తెలంగాణ ముద్దుబిడ్డచాకలి ఐలమ్మ..

**– చిలువేరు నాగమణి,**
మిర్యాలగూడ,
నల్లగొండ
9959943131



## 77. కవితాంజలి

నవ మంజరి అందించిన దాశరధి
రుద్రవీణ రాగాలతో అగ్నిధారలు కురిపిస్తూ
బందీఖానాలో మహాబోధివై
అగ్నిధార కురిపిస్తూ వీణపాణికి
వీనులవిందుగా కవితామృతాన్ని
ఆనంద రాగాలతో అందించావు
నవ  శకానికినాందిగా..యువకుల్లో..
పునర్నవంగా పునర్జీవం పోసావు
మహేంద్రోదయమై   పునీతుడవయ్యావు
ఓ దాశరధి ఇదే నా కవిత అంజలి


**– ఇమ్మడి రాంబాబు,**
తొర్రూరు,
మహబూబాబాద్
9866660531



# 78. గురువుకు వందనం !

గురువుకు వందనం! అభివందనం!!
గురుశిష్యుల అనుబంధం! మధురాతి మధురం!!
చిన్నారుల భవిష్యత్తుకు గురువే మార్గదర్శకుడు!
పిల్లలు తల్లిదండ్రులకు సమానం కాకపోవచ్చు!
బడిలో పిల్లలందరూ గురువుకు సమానమే!!
అందుకే...
గురువు కు వందనం! అభివందనం!!
అమ్మ–నాన్నగా జీవితాక్షరాలను నేర్పి!
అలుపెరుగని విక్రమార్కుడిలా అక్షరమాల నేర్పి!
ఎన్నిసార్లు తప్పులు దిద్దినా
అలసట లేకుండా సర్దిచెప్పి!
అజ్ఞానమనే చీకటిని తొలగించి!
జ్ఞానమనే వెలుగును ప్రసాదించి!
ఓర్పుతో, నేర్పుతో విద్యార్థుల భవిష్యత్తుకు బాటను వేసిన గొప్ప వ్యక్తి!!
నవ సమాజ నిర్మాణానికి తోడ్పాటునందించే గొప్ప మానవతావాది!
అందుకే...గురువుకు వందనం! అభివందనం!!

– **మిర్యాల ప్రకాశ్,**
చిట్యాల,
నల్గొండ జిల్లా
8341458729



# 79. పంతులమ్మ

బడి తెరుస్తున్నారంటే సంబురమైనది
పిల్ల మొఖాలు, బడి పరిసరాలు యాదికొచ్చి
 మురిసిపోయిన గని... బడికి పోవుడెట్ల?
బస్సులు నడుస్తలేవాయే ఊర్లల్లకి
షేరింగ్ ల పోయేది లేదాయె కరోన భయంతోటి
గుండెల్ల గుబులు మొదలాయె మరి...బడికి పోవుడెట్ల?
బండి నడుపొస్తది గనిగా రోడ్లెట్లున్నాయో ?ఏమో?
ఎండాకాలంలనే గుంతలుండి ఎత్తేస్తుండే
 గిప్పుడు వాన కాలం వొచ్చే
నీల్లు నిల్చిన కాడల్లా ఆగి,
ఆ బాటన
నలుగురు పోయినంక పోవాల్సొచ్చె
ఆదమర్చి పోతె కాలో,చెయ్యో ఇరిగితే ఎట్ల?
చచ్చి, చెడి బడికి చేరేసరికి దిమ్మెరపోతిని
పంతులమ్మ నువ్వు  బడికి పోవుడెట్ల?

**– అనుమాల వాణి,**
నల్గొండ
9848412525

# 80. బడి బెంగటీలింది...



ముంగారువాన ముసురు ముసురుగా కుర్వంగనే
ఎండకాలపు సెల్వులన్నీ ఖతమైతుండే..!
తాతిళ్లకు ఊర్లళ్లకు పోయిన
పిల్లగాండ్లంతా ఇంటి తొవ్వ పడుతుండ్రే!
మొదాలు కొత్త సద్దిడబ్బలు, కొత్త సంచులు
నీళ్ల కీసలు, పలకలు బలపాలపుడలు కొనుక్కోని
బడికి వోవుటానికి షురు అయితుండ్రే!
పంతుల్లందరు మూలకున్న సరంజామనంతా
దులుపుకొనిఅటకెక్కిన  సదువుసెప్పే
 సామాన్నంతా ఓపారి సూసుకుంటుండ్రే!
ఈ యాడాదన్న మా కొడుకులు,బిడ్డలు
మంచిగ సద్వి బగ్గ మార్కులు దెచ్చుకోవాలని
సల్లంగ బతకాలని తల్లిదండ్రులంతా
ఇష్టదేమున్ని మొక్కుకుంటుండ్రే!
బడులన్నీ తెర్వంగనే బడిబాటకని బిరబిర ఊర్లపెద్దమనుషులంతా
 సార్లు టీచర్లతో కలలి బయలెల్లుతుండ్రే!
ఇల్లిల్లు తిరిగి నమోదుకై దేవులాడి పిల్లగాండ్లను ఎదుర్కతుండ్రే!
సంబురంగ కొత్త వయ్యిలు..కొత్త బడిబట్టలు పంచుతుండ్రే!
బడిని పెల్లికూతురులెక్క ముస్తాబుసేసి
హాజరు పెంచనీకి తండ్లాడుతుండ్రే!
గిప్పుడు గయన్నీ లేక ఆన్ లైన్ పాఠాలని పిల్లలు లేక బళ్లన్నీ
బెంగటీలవట్టే!
టివిలు సెల్లుఫోనులు లేనోల్ల బతుకు గండమాయే!!
మల్ల ఎన్కటి రోజులు ఎప్పుడత్తయా అని సర్కారు బళ్లు ఎదురుసూడవట్టే!
ఇంటికాడ పిల్లగాండ్లు సెప్పినట్టు ఇనక గాలిగాలి కావట్టే!!
గీ కరోనాకు గత్తరవెట్ట...బతుకులను గిట్ల ఆగమాగం జేసే!


**– అయిత అనిత,**

జగిత్యాల – 8985348424

# 81. దృశ్యం



మైకులన్నీ ఆమె మూతి ముందు చేరాయి
చంపినోళ్ళని ఏం చేద్దామన్నాయి
తప్పుంటే తొలుతియ్యమన్నది
నేరం చేస్తే నడిరోడ్డుపై కాల్చేయమన్నది
న్యాయం ఎవరికైనా ఒకటని ఆమె అన్నది

**దృశ్యం2**
దేవుడు ఉరేగుతున్నడు నవ్వుకుంటూ
తూనీగల్ని తూటాలతో చంపానని
దేవతలు పూలాభిషేకం చేస్తున్నరు
ఓ పని అయిపోయిందని
దృశ్య శ్రవణాలు భేష్ భేష్ అంటున్నయి
అగ్రకుల కమ్యూనిస్టు కూడా
పేలిన తూటాలకు సలామన్నడు

**దృశ్యం3**
మైకులు మళ్ళొసారి వచ్చాయి
మనసుపడి మనువాడినోడు
పోయాడన్న దుఃఖం వాటికి కనపడలేదు
ఎదురకాల్పులపై నీ మాటేంటిని అడుగుతున్నయి
నేరం చేస్తే శిక్షించమన్నా
నిరూపించకుండ ప్రాణం తీస్తర
జవాబు చెప్పని జర్నలిజం
మెదడుకు పని చెప్పకుండానే నిష్క్రమించింది తాజా వార్తకోసం



**దృశ్యం 4**

ఆఘమేఘాల మేఘాల మీద
వచ్చింది హక్కుల సంఘం
పేలిన తుపాకీల ఆచూకీ తీస్తోంది
బక్కోళ్ల గుండెలు చీల్చిన గన్నులేవోనని అడుగుతోంది
ఎరుపెక్కిన చేలో తెలిసిన జవాబులైన
ఏమీ ఎరగనట్టు పాత ప్రశ్నలే అడుగుతోంది
ఎంతకాలమైనా కొంతకాలానికి
కన్నూ మనదే కత్తీ మనదే
ప్రశ్నలకు సమాధి కట్టేయ్
విచారణ రిపోర్టును మూతకట్టెయి
బహుజనుల ప్రాణాలను పట్టించుకునే నాథుడేడి

**దృశ్యం 5**

పీనుగుల కొట్టంలో శవాలు పడిన్నయి
తూటా రుచి చూసిన నోళ్లు తెరుచుకున్నయి
అలుముకున్న ఈగలు తిరుగుతున్న దోమలు
ఎప్పుడూ ఈ బక్క పీనుగులేనా
నేరం చేసినా బలిసిన శవాలు
రావేంటని ఒకటినొకటి ప్రశ్నించుకుంటున్నాయి.

**– పి.వేణుగోపాలరావు,**

నల్గొండ – 9494949461



# 82. అమ్మ

కొలువుదీరిన కవుల ముందర
యాస పలుకులు పలుకడానికి
పలుకుచుంటిని అమ్మ పదములు
కమ్మదనముతో మనసు నిండా

కన్నబిడ్డలు యాస మరిచే, భాష మరిచే
నేల విడిచి సాముచేయ
అన్య భాషల ప్రీతి తోడ
అమ్మభాషను వదిలి వేసిరి
తల్లివేరు తనివితీరా తడిమి చూడు
తగులుతాయి ఆత్మీయతల జాడ
బువ్వకోసం అవ్వ నొదిలినా
అమ్మ నీ జన్మ అయితే భాష నీ మనుగడ

**మాదగాని శంకరయ్య**
నల్గొండ జిల్లా
891988969

# 83. మాధుర్యం



ఇరిగిన రెక్కలనడుగు
ఎగిరే బలమెక్కడ ఉందో
తెగిపడిన మొప్పలనడుగు
నీటిలో ఈదే బలం ఎంతని
మూగబోయిన గొంతునడుగు
మాటకు మించిన రాగం ఏంటో
మాటలు రాని మూగ జంతువులనడుగు
బాసలేని బాధయేంటో

మనిషి మనిషినడుగు
భాషయాసల బరువును
బతుకంతా మోయడమెందుకో
నాన్న అడుగుల భాషనడుగు
నడత నేర్పిన యాస బాట ఎక్కడో
భాష నేర్పిన అమ్మనడుగు
యాస మాధుర్యమేంటో..!!

**శ్రీమతి పాలడుగు సరోజిని దేవి**
జిల్లా విద్యాధికారి
భద్రాద్రి కొత్తగూడెం జిల్లా.

# 84. ఆత్మన్యూనత వదులుకుందాం!



మన యాసే మన బతుకు
మన యాసే మన సంస్కృతి
అటువంటిది యాసనే కాదు
మన భాషల మాట్లాడటం కూడా
చిన్నతనంగా మారిపోయింది
అమ్మ భాషలో మాట్లాడేవారు
ఆత్మనూన్యతకు లోనవుతున్నరు
అమ్మా అంటే అమ్మకూడా ముఖం చిట్లిస్తోంది
మనకు అత్తామామలు
చిన్నమ్మ పెద్దమ్మలూ ఎవరూ లేరు
అంతా ఆంటీ అంకుల్సే
మనం బడికి పోం.. స్కూల్ వెళ్తం
మనం అన్నం తినం, రైస్ తింటం
మనం పుస్తకాలు చదవం, బుక్స్ చదువుతం
నాడు సంస్కృతం, ఉర్దూ... నేడు ఇంగ్లీషు
మన భాష యాసల్ని మనకు కాకుండా చేస్తున్నాయి
కాదు... కాదు... ఆ భాషల మోజులో
మనమే దూరం చేసుకుంటున్నాం
ఇకనైనా... మేల్కొందాం..
కాళోజీ స్ఫూర్తితో ఆత్మన్యూనతను వదులుకొని
మన యాసను బతికించుకుందాం
మన యాసలో మాట్లాడతానని, రాస్తానని ప్రతిజ్ఞ చేద్దాం
మన బతుకులకు, మన సంస్కృతికి జీవంపోద్దాం.

– డాక్టర వి.జయప్రకాష్

# యాస కవితా సంకలనం ఆవిష్కరణ




## ఆవిష్కరణ : డా॥ నందిని సిధారెడ్డి గారు

తెలంగాణ సాహిత్య అకాడమి తొలి అధ్యక్షులు

తేది : 9 సెప్టెంబరు, హైదరాబాదు

గౌరవ సంపాదకులు
**శ్రీ మాదగాని శంకరయ్య**
యోగా గురువు

ప్రధాన సంపాదకులు
**శీలం భద్రయ్య**

సంపాదకులు
**సాగర్ల సత్తయ్య**
**డా॥ జయప్రకాశ్**

## వందనా పబ్లికేషన్స్ - నల్లగొండ జిల్లా

'యాస' కవితా సంకలనంలో తెలంగాణ సాంస్కృతిక చైతన్యాన్ని తెలియజెప్పే కవితలు, తెలుగు యాస, భాష గొప్పదనాన్ని వర్ణించే కవితలు, కాళోజీ ప్రత్యేకతను చాటిచెప్పే కవితలు, తెలంగాణ సహజ స్వేచ్ఛా  రామణీయకతను పరిమళిస్తున్నాయి.

– డాక్టర్ నందిని సిధారెడ్డి

భాష ఒక ఉపన్యాసమనుకుంటే యాస దాని శ్వాస. అసలు యాస లేకుండా భాష మనుగడే ఉండదనడం కూడా అతిశయోక్తి కాదు. తెలంగాణ భాషలోని సొబగును ఊరేగించిన మనీషి కాళోజీ. ఆయన జయంతి సందర్భంగా ఒక కవితా సంపుటి తీసుకురావడం, దానికి 'యాస' అని పేరు పెట్టడం బాగుంది.

– డాక్టర్ ఏనుగు నరసింహారెడ్డి

## సంపాదక వర్గం



మాదగాని శంకరయ్య
తెలుగు భాషోపాధ్యాయులు
ప్రభుత్వ ఉన్నత పాఠశాల (బాలుర), నల్గొండ.



శీలం భద్రయ్య
పిజిటి తెలుగు, తెలంగాణ మోడల్ స్కూల్
పల్లాల, శాలిగౌరారం, నల్గొండ జిల్లా



సాగర్ల సత్తయ్య
స్కూల్ అసిస్టెంట్ (తెలుగు)
జి.ప. ఉన్నత పాఠశాల, చింతగూడెం,
అనుముల (మం), నల్గొండ జిల్లా



డాక్టర్ వి.జయప్రకాష్
పిజిటి తెలుగు, తెలంగాణ మోడల్ స్కూల్
రేగోడ్ (గ్రా&మం), మెదక్ జిల్లా